# ★అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

121 జులై 1990



ఈ మట్టిని తెలుసుకోని....

# విషయసూచిక

**సంపాదకీయం :**

పాతికేళ్ళ కిందట... .... 3

**కవితలు :**

తప్పటడుగు ఆయుధం చేసుకొని... —ఎమ్. కృష్ణారావు .... 6
కవిత్వమా! యుద్ధగీతమై దద్దరిల్లు —వల్లాం తిరుపాల్ ... 7
జహాఁ యాపినాడు —ప్రసాద్ .... 7
అరుణ స్మృత్యంజలి .... 8
అనివార్యం —గోపి .... 9
పద సాయుధమౌతుంది —"కా. ప్ర." .... 10
'ప్రొలిటేరియట్' ప్లీజ్! —పొదలకూరు మధుకుమార్ .... 57
గుండెదడ —సికింద్రా .... 58

**కథలు :**

'కాంట్రా'పెడితేనేం పోలీసు పెళ్ళి
—కె. ఎస్. వాణి, వసంత లక్ష్మి .... 11
ప్రతీకారం —రేపల్లె సాంబశివరావు ... 30

**వ్యాసాలు :**

హరిత విప్లవం అసలు రంగు —ఎస్. చంద్రశేఖర్ .... 18
కమ్యూనిజం లేని కమ్యూనిస్టులు —రోటస్ గాంధీ .... 34

**సమీక్ష :**

పగిలిన అద్దంలో పాతిక చిత్రం —మానేపల్లి .... 60

**స్వీకారం** .... 58

ముఖచిత్రం : పి. వి. ప్రసాద్

---

"అరుణతార"కు రచనలు, చందాలు, వివరాలు పంపవలసిన అడ్రసు :

వి. చెంచయ్య

8-5-13, కావలి - 524 201, నెల్లూరు జిల్లా.

సంపాదకీయం :

# పాతికేళ్ళ కిందట....

'సరిగ్గా పాతికేళ్ళ కిందట ఆరుగురు దిగంబర కవులు- నగ్నముని, జ్వాలాముఖి, చెరబండరాజు, నిఖిలేశ్వర్, భైరవయ్య, మహాస్వప్నలు- ఈ 'కుష్ఠు' వ్యవస్థపైన తమ కవితాయుధాన్ని సంధించారు. అంతవరకూ నిశ్శబ్దంగా, స్తబ్ధంగా వున్న తెలుగు సాహిత్యరంగం ఒక్కసారి అదిరిపడి నిద్ర లేచింది. నిద్రయితే లేచిందిగాని, కాస్త తేరుకుని దిగంబర కవిత్వంపైన విరుచుకుపడింది. దిగంబర కవిత్వాన్ని ఆడిపోసుకుంది. దిగంబర కవితా ధోరణిని సహించలేకపోయింది. 'దిగంబర' అనే మాటకు పెడర్థాలు లాగి విసుర్లు విసరడం మొదలుపెట్టింది. ఆయినా దిగంబర కవులు భయపడలేదు. ఏటికి ఎదురీదినట్టుగా సాహిత్యరంగంలో ఒంటరిపోరాటం చేశారు. కలాన్ని కత్తిలాగా ఝళిపించారు

అయితే దిగంబరకవిత్వాన్ని ఆహ్వానించినవాళ్ళు అసలు లేక పోలేదు. వాళ్ళలో మొదటివాడు మహాకవి శ్రీశ్రీ. దిగంబరకవుల్లోని ఆవేదననూ తపననూ, కోపాన్నీ, కసినీ, పైకి కనబడకపోయినా అంతర్లీనంగా సమాజం పట్ల ఉన్న ప్రేమనూ గుర్తించి, ఒకవిధంగా సాహిత్యరంగంలో 'బహిష్కృతు'లయిన దిగంబర కవుల్ని ఆప్యాయంగా పలకరించి, వెన్నుతట్టి ముందుకు పదమన్నవాడు శ్రీశ్రీ.

ముందుముందు రాబోయే విప్లవ సాహిత్యోద్యమానికి గల నేపథ్యంలో తామూ ఒక భాగం కాగలమని దిగంబరకవులు కూడా ఊహించివుండరు. సాహిత్యరంగంలో తాము నిర్వహించబోయే చారిత్రక కర్తవ్యపాత్ర పట్ల స్పృహ ఉండిఉండదు. ఒక అసంకల్పిత ప్రతీకారచర్యలాగా దిగంబరకవులు దూసుకువచ్చారు. అవినీతినీ, అన్యాయాన్నీ, నటననూ, మోసాన్నీ, కపటత్వాన్నీ, నయవంచననూ, ముసుగుల్నీ సరికొత్త పదప్రమాణాలతో కడిగేశారు. వాళ్ళవి సొంత గొంతులు, అరువు తెచ్చుకున్నవి కావు. వాళ్ళవి హృదయాల్ని చీల్చుకువచ్చిన మాటలు, పెదవులపైనుంచి రాలినవికావు. అందుకే ఆ కవిత్వానికి అంత వాడి, వేడి వచ్చింది.

శ్రీశ్రీ మహాప్రస్థాన కవితలు రాస్తున్నరోజుల్లోనే అవి కవితలుకావు, నినాదాలన్నవారున్నారు. ఆ తర్వాత శ్రీశ్రీని ఆధునికయుగ మహాకవిగా

గుర్తించకతప్పలేదు. కానీ యివాళ అది కవిత్వం కాదు అనేవాళ్ళు దాదాపులేరు. కవిత్వంలో కొత్తదనాన్ని వ్యతిరేకించేవాళ్ళు ప్రయోగించే మొదటి అస్త్రం ఇది.

1965లో ఒకటీ, 66లో ఒకటీ, 68లో ఒకటీ- మొత్తం మూడు కవితా సంకలనాలు వచ్చాయి దిగంబరకవులవి. నాలుగు సంవత్సరాల కాలంలో వచ్చిన ఈ మూడు కవితాసంకలనాల్ని పరిశీలిస్తే దిగంబరకవుల్లో వచ్చిన పరిణామం తెలుస్తుంది. బలమైన నిరసనతో ప్రారంభమై, ఆవేశంతో ఊగిపోయి, కాస్త ఆలోచించి, అస్పష్టంగానైనా ఒక కమిట్‌మెంటును ఏర్పర్చుకుని, మార్క్సిస్టు దృక్పథాన్ని అలవర్చుకున్న పరిణామక్రమం కన్పిస్తుంది. ఈ ప్రకృతిలో, ఈ సమాజంలో ఏదీ మార్పుకు అతీతం కాదు మార్పు ప్రకృతి సమాజాల చలన సూత్రం. ఆ మార్పు- తాత్కాలిక ఒడిదుడుకులు కొన్ని ఉన్నప్పటికీ- అభివృద్ధికరమైంది కూడా అవుతుంది. అదే దిగంబర కవిత్వంలో కనిపిస్తుంది.

అయితే దిగంబర కవిత్వంలో వచ్చిన ఈ అభివృద్ధికరమైన మార్పును దిగంబర కవుల్లోనే కొందరు వ్యతిరేకించారు. వాళ్ళలో ముఖ్యుడు మహాస్వప్న. కవిత్వానికి కమ్యూనిస్టు వాసన తగలడం అతనికిష్టంలేదు. సిద్ధాంతాలూ, పార్టీలూ అవసరంలేదని అతని అభిప్రాయం. ఇజాలకతీతంగా నిజం ఉంటుందనేది అతని నమ్మకం. ప్రకృతి పరిణామానికి ఒక నియమం ఉన్నప్పుడు, సమాజాభివృద్ధికి ఒక సూత్రం ఉన్నప్పుడు, కవిత్వానికొక సిద్ధాంతం లేకుండా ఎలా ఉంటుంది? ఈనాటికీ ఇలాంటి భ్రమల్లో ఉన్న కవులు అనేకమంది ఉన్నారు. అయితే వీళ్ళలో కొందరు నిజంగా అలా నమ్ముతున్నవాళ్ళు కాదు, దాన్ని తమ స్వార్థానికీ, తమ బాధ్యతారాహిత్యానికీ ముసుగుగా తగిలించుకుంటున్న వాళ్ళు ఇవాళ వచనకవిత్వం ఈ ముసుగు కవుల కబంధహస్తాల్లో బాధింపబడే ప్రమాదానికి లోనవుతోంది. పాట ఎలాగూ వీళ్ళకు లొంగదు. అది కాలికి గజ్జ కట్టుకుని గిరిజన జీవితాల్ని, ప్రజాఉద్యమాల్ని, పీడిత తాడిత హృదయ స్పందనల్ని ప్రజాయుద్ధరంగంలో గానంచేస్తోంది. అటువైపు చూడ్డానికి కొందరు వచనకవులు ప్రయత్నిస్తున్నవారూ లేకపోలేదు.

దిగంబరకవుల మూడో సంకలనం వెలువడే (1968) నాటికే నక్సల్బరీ విప్లవస్ఫూర్తి శ్రీకాకుళాన్ని కూడా వుండించింది. వెంపటాపు సత్యం వంటి గిరిజన నాయకులు ఆయుధంతోబాటు అక్షరాయుధాల్ని ధరించారు. సుబ్బారావు పాణిగ్రాహి లాంటి కవులు కలంతోబాటు కత్తిపీ పట్టారు. పెన్నూ, గన్నూ

ఏకమయ్యాయి. కవిత్వం ఉద్యమంతో పెనవేసుకుపోయింది. ఇలాంటి నేపథ్యంలో దిగంబర కవులు నాలుగో సంపుటానికి ప్రయత్నించేసే అవకాశం కూడా లేకుండాపోయింది. 1970 ఫిబ్రవరిలో విశాఖలో శ్రీశ్రీ షష్టిపూర్తి కార్యక్రమంలో విశాఖ విద్యార్థుల సవాల్ రచయితల్ని రెండు వర్గాలుగా మార్చింది. నక్సల్బరీ శ్రీకాకుళ రైతాంగపోరాటాన్ని ఆహ్వానించేవాళ్ళు ఒకవర్గమైతే, దాన్ని వ్యతిరేకించేవాళ్ళు మరోవర్గం. పాణిగ్రాహి లాంటి కవులు పీడిత ప్రజల విముక్తికోసం ప్రాణార్పణ చేస్తుంటే, సన్మాన కార్యక్రమాల నుంచి బయటపడి, ప్రజాఉద్యమాలలో మమేకం కావడానికి కొందరు కవులైనా సిద్ధపడ్డారు. కాలంతోపాటు, సమాజంతోపాటు మారుతూ, సహజ పరిణామ క్రమాన్ని అర్థంచేసుకుని, సమాజాన్ని ఒకడుగు ముందుకు నడిపించే ప్రజా ఉద్యమాల ప్రేరణతో సాహిత్యాన్ని సమాజపరం చెయ్యాలనుకున్న కవులూ, రచయితలూ, విమర్శకులూ, కళాకారులూ 1970 జూలై 4వ హైదరాబాద్‌లో విప్లవరచయితల సంఘాన్ని ఏర్పరచారు. దానికి శ్రీశ్రీ అధ్యక్షుడు. దిగంబర కవుల్లోని చెరబండరాజు, జ్వాలాముఖి, నగ్నముని, నిఖిలేశ్వర్‌లు విరసంలో చేరారు. దిగంబరకవుల ఈ పరిణామాన్ని అంగీకరించలేక భైరవయ్య, మహాస్వప్నలు దూరంగా ఉండిపోయారు. తన జీవితకాలంలో చివరిక్షణందాకా విప్లవసాహిత్యోద్యమంతో, విరసంతో ఉన్నవాడు మాత్రం 'దిగంబర'కవుల్లో చెరబండరాజు ఒక్కడే. విరసం ఏర్పడకముందునుంచీ చెరబండరాజు 'దిగంబర' కవిత్వంలో దిగంబర ధోరణి కొంత ఉన్నదేగాని, దిగంబరావేశంలేదు. తక్కిన దిగంబర కవులకూ, చెరబండరాజుకూ ఈ మౌలికమయిన తేడా మొదట్నించీ కనిపిస్తుంది. విప్లవసాహిత్యోద్యమంలో భాగస్వామి అయ్యాక చెరబండరాజు పాటకు ప్రాణంపోశాడు. రాసిలోనూ, వాసిలోనూ తన ప్రత్యేకతను నిరూపించుకున్నాడు.

దిగంబరకవులు సాహిత్యలోకంలో కలిగించిన సంచలనం పెద్దదే. అందరూ దాని తాకిడికి గురయినవాళ్ళే. ఎంత వ్యతిరేకులయినాసరే దాన్ని ignore చెయ్యలేకపోయారు. అన్నిరకాల వాళ్ళనీ సాహిత్యం గురించి ఆలోచింపజేశారు దిగంబర కవులు. సాహిత్య ప్రయోజనం గురించీ, సాహిత్యానికీ, సమాజానికీ ఉన్న సంబంధం గురించీ అందరూ చర్చించసాగారు. విరసం పుట్టుకతో ఆ చర్చ ఒకకొలిక్కి వచ్చింది.

దిగంబర కవులకు ఎంత ఆవేశం ఉందో సామాజిక అవగాహనపట్ల అంత ఆలోచన లేదు. దిగంబర కవులకు ఎంత విరసనశక్తి ఉందో అంత

నిర్మాణాత్మక దృష్టిలేదు. అందువల్ల అదొక బలమైన నిరసన ఉద్యమంగా మిగిలిందేగాని, సామాజిక చైతన్యంతో కూడిన సాహిత్యోద్యమంగా నిలవలేక పోయింది. దిగంబర కవుల్ని పొగడ్డానికి వాళ్ళకు పూర్తిగా సామాజిక చైతన్యం ఉందని అనక్కరలేదు. దిగంబరకవుల్ని తిట్టడానికి తెలుగు సాహిత్యరంగంలో వాళ్ళు నిర్వర్తించిన చారిత్రక పాత్రను విస్మరించనక్కర లేదు. దిగంబర కవులు పుట్టినప్పటినుంచి ఈ పాతికేళ్ళ కాలంలో ఎవరు ఏమిటో, ఎవరు ఎక్కడ మిగిలిపోయారో, ఎవరు ఎక్కడ ఆగిపోయారో, ఎవరు అలుపూ సలుపూ లేకుండా కవితాప్రస్థానం సాగించారో, ఎవరు విప్లవ కవులో, ఎవరు కాదో ప్రత్యేకంగా చర్చించి వాదవివాదాలు చెయ్యాల్సిన అవసరంలేదు తమ సామర్థ్యాలనూ, తమ బలహీనతలనూ, తమ మంచినీ, తమ చెడ్డనూ ఎవరికి వాళ్ళే స్పష్టంగా నిరూపించుకున్నారు.

---

## తప్పటడుగు ఆయుధం చేసుకొని....

ఓ పరిచయం లేని స్నేహితుడా! నిన్ను నా కలల్లోనే ఊహిస్తే
గాలిలో మిళితమైన పాటలా, రాత్రితో చెలిమిచేసిన జాబిలిలా
అడవి ఒడిలో పిడికిలి బిగించిన వీరుడిలా అగుపించావు.
నిన్నటి స్మృతుల్లో నా ఆలోచనవి, నా పెదాల అంచులమీద మోగుతున్న పాటవి
నా అశ్రువులతో అల్లిన స్వప్నానివి, నా ఎదనిండా నిండిన స్ఫూర్తివి
నా గుండెల్లో మండిపోతున్న గాయానివి
తూర్పు శిఖరపు దారిలో జారులుతీరిన కిరణాల్లో కాంతివి
మరేం నేస్తం! విజయ కేతన రాగాల్ని రెపరెపలాడించి
ఇప్పుడు నీ వాయిద్యం తంత్రులు మార్చుకొని ఏ కూనిరాగం పాడాలనొచ్చావు
త్యాగాల వెన్నులో బాకువైనావు కదా!
నీ ఆయుధం పట్టుజార్చి శత్రువు పాదాక్రాంతం చేరావుకదా!
మేఘాలు కమ్మినపుడే తుఫాన్నెదుర్కొనే స్థయిర్యంతో ముందుకు సాగాలి
త్యాగం కౌగిలించుకున్న వీరుడివై తప్పటడుగుల్ని ఆయుధాల్ని చేసుకొని
నీవే యుద్ధభేరివై మ్రోగాలి!
ఆశాలతలకు ఊహలు పూవులై పూసే ప్రపంచాన అడుగిడాలి!

(వెనదుగేసిన మిత్రులకు)

—ఎమ్. కృష్ణారావు

# కవిత్వమా! యుద్ధగీతమై దద్దరిల్లు

ఎప్పుడూ ఏదో సవ్వడి వినిపిస్తుంది
అదృశ్యవ్యక్తి ఆలాపన లాగనిపిస్తుంది
విన్నకొద్దీ ఇంపుగా దగ్గరగా దగ్గరగా మరింత దగ్గరగా
ఎప్పుడో.... ఎక్కడో... ఎవ్వరిదో
ఎన్‌కౌంటర్ శిశిరానికి రాలిన వసంతపుష్పం
చివరి జీవకణం వినదించిన ధిక్కారగీతం
చల్లగాలీ! నువ్వు స్పర్శిస్తే ఉరకెత్తే వయస్సే
పండువెన్నెలా! నువ్వు వెలుగుపరదాలు పరిస్తే ఉక్కిరిబిక్కిరయ్యే మనస్సే
కానీ...
కంటిముందు యుద్ధంచేసే యవ్వనమే కనిపిస్తున్నది
యుద్ధం నువ్వెవ్వరివని ప్రశ్నిస్తున్నది
ఇప్పుడే ఇక్కడే ... కళ్ళముందే
స్పష్టంగా స్పష్టంగా మరింత స్పష్టంగా
యుద్ధం! యుద్ధం!
కవిత్వమా! మందు పాత్రలలో యుద్ధగీతమై దద్దరిల్లు.

—పల్లాం తిరుపాల్

# బహురూపివాడు

ఎన్నెన్ని మట్టిచేతుల సత్తువతో, ఎందరెందరి త్యాగాల బలిదానాల రక్తంతో
ఎన్ని వేనవేల అమరుల తృణప్రాయ జీవితాలతో
సమసమాజ నిర్మాణపు జనసమూహంలో అతని రూపం ఎక్కడని వెతకను?
అతని త్యాగాన్ని ఎన్నిచేతులు చాచి కొలవను?
కత్తివేటుకు రెండుగా చీలిన శరీరంలా వున్న ఈ వర్గసమాజంలో
వర్గరహిత సమాజాన్ని కోరే అతని రూపాన్ని, ఎన్ని కళ్ళతో కనిపెట్టను?
ఏ హృదయాల గుండెతడిని తడిమి పసిగట్టను?
గాలిలో కలిసి ప్రాణవాయువయ్యాడని చెప్పనా?
చాపకిందనీరై, పారే సెలయేరై శత్రునిర్బంధాన్ని ఛేదిస్తున్నాడని చెప్పనా?
గిరిజనారణ్యంలో అజ్ఞాతపు కోకిలై గొంతెత్తి పాడుతున్నాడని చెప్పనా?

చిక్కనీ చీకటి గుండె గుడిసెలమాటున
సి.కా.స. సమ్మె పిలుపై, సింగరేణి పిడుగై గర్జిస్తున్నాడని చెప్పనా?
ఏం చెప్పను నేస్తం! అతని చిరునామా ఎక్కడని చెప్పను?
మనిషిని మనిషిగా, శ్రమని శ్రమగా గుర్తించని ఈ దోపిడివ్యవస్థను జబ్బచరిచి-
సమతను పంచిచ్చే సామాజిక వ్యవస్థకోసం-
తనువు అణువణువూ జనానికి పంచి,
నీకూ నాకూ మధ్య పారే ప్రజా ప్రవాహంలో
ఉప్పెనలా ఉరుకుతున్న ఉద్యమ రూపాన్ని రచిస్తూ-
వర్గకసితో నిండిన బాయ్‌నెట్ చూపుల కొనల
సూటిగా ప్రభుత్వం కళ్ళను పొడుస్తున్న ప్రజాయుద్ధభేరై
కోట్లాది పీడితజనం కళ్ళముందు బహుళరూపై కాలగమనంలో కలిసేవుంటాడు!

—శ్రామిక్

## అరుణ స్మృత్యంజలి

దేహమున్నన్నినాళ్ళు దహనమౌతూ
తిమిరంతో సమరంసాగించే వెలుగుదివ్వెలు వాళ్ళు
పారే నదీప్రవాహంలో ప్రతి తరంగపు తాకిడికి తరిగిపోతూ
నదిని విశాలంచేసే తీరం వాళ్ళు
ప్రజల్ని కన్నీళ్ళతో ముంచేస్తూ ఎగురుతుంటూ వెళ్ళింది గతం.
సానుభూతి తెలియని కాలం
తన కర్తవ్య నిర్వహణలో కదిలిపోతూనే ఉన్నది
శిశిరం మాత్రం చిన్నబోయి విన్నవదనంతో చూస్తున్నది
అందరూ సుఖపడాలని, ఆత్మబలిదానం చేసిన ఓ నా కామ్రేడ్స్!
సుదూర ఆకాశంలో, సూపర్ నోవాలో
ప్రకాశిస్తున్న.... మీకోసం
అరుణ స్మృత్యంజలి ఘటిస్తున్నా.

[రచయిత పేరు వ్రాయలేదు.]

# అనివార్యం

అడవి - విన్నలా... నేడులేడు
ఏపుగా పెరిగిన వటవృక్షాలు పైతం, ఆకురాల్చి బోడులై నిలిచాయి
రాలిన ఆకు - ఎక్కడో అంటిన నిప్పుకు:
ఎగిసి ఎగిసి అడవి అడవంతా దావానలంలా మండుతోంది.
మంట - పొగ - మంటలతో, ఆకంతా బూడిదై పోయింది
ఈ బూడిదే, రూపాంతరం చెంది
మళ్ళీ మళ్ళీ చిగురించే ఆకుకు ఎరువుగా మారుతుంటే....
అడవి పరికొత్తదనంతో ఎదిగిపోయింది.

• • •

జనం - విన్నలా.... నేడు లేరు
సమస్యల సుడిగుండాలు సుళ్ళుతిరిగి ఉక్కిరిబిక్కిరి చేస్తే
గిరగిర తిరిగి లేచి చూస్తే ఎక్కడో రగిలిన పోరుకు
తిరగబడ్డ జనసమూహాల హోరు ప్రతిస్పందనై కావవచ్చింది.
ఊరూ, వాడా, నగరం కదిలిరాగా
కాల్పులు- క్యాంపులు- మినీ ఎమర్జెన్సీలు-
కాటేయబోతే ఒడుపుగా తప్పించుకున్న- జనం;
మళ్ళీమళ్ళీ రగులుతున్న పోరులో చైతన్యం రంగరించుకున్నచోట
నవ్యమానవ రూపంరాగా...
కొంగొత్త ఉద్యమాల ఊపిర్లు పీలుస్తున్న సమయమిది-

—గౌతమి

# సభ సాయుధమౌతుంది

సభకు హాజరుకావడమే- ఒక సాహసయాత్ర అయినపుడు
హాజరైన వ్యక్తి 'ఖాకీ'కి వాంటెడ్ పర్సన్ అయినపుడు
అది - రైతుకూలీసభ అయితేనేమి-
రచయితల సభ అయితేనేమి!
సభ - సాయుధమౌతుంది
గురితెలిసి పేలే ఆయుధమౌతుంది
అడవి నదిఒడ్లో పేలిన భూమి

గోదావరీ హృదయ కెరటనాదంలో లీనమై
మైదానాన్ని మేల్కొలిపి-
పాణిగ్రాహినగర్ నిండా పిడికిళ్ళు పరుచుకొన్నపుడు
పాణిగ్రాహి పాట తుపాకీతూటా అవుతంది
పోరాటపు బాట అవుతుంది
పాణిగ్రాహినగర్ ప్యారిస్ కమ్యూన్ అవుతుంది
ఇక - చెరబండరాజు నగర్ గురించి చెప్పేదేముంది
గెరిల్లాజోన్‌కి పెన్నూ గన్నూ కలిపిగీసిన స్కెచ్ అవుతుంది
వెన్నుముక కలంలో నెత్తురు సిరాగా ప్రవహించి
రచించిన సాయుధ నినాదమౌతుంది
అవును! సభ సాయుధమౌతుంది
గురితెలిసి పేలే ఆయుధమౌతుంది
కుక్కిమంచంలోని ముసలిపీనుగు
కత్తుల వంతెనమీదనుంచి లగించుకొచ్చినపుడు
నిండు బాలింత నిప్పులగుండంలో తన గుండెను
పూబంతిలా దొర్లించుకొంటూ సాగివచ్చినపుడు
ఉగ తెలియని పిల్లాడు వడిశెలరాయై దూసుకొచ్చినపుడు
అపుడు! సభ - అమరవీరుని నెత్తుటిజ్ఞాపకమౌతుంది
యుద్ధరంగపు ఎత్తుగడ అవుతుంది.
అవును! సభ సాయుధమౌతుంది
గురితెలిసి పేలే ఆయుధమౌతుంది
కనురెప్పలకింద తడి నెత్తురై గడ్డకట్టి
గుండెను తొలుచుకొని ఉప్పొంగినపుడు
పది అనుభవాలు ఒక దగ్గర పరుచుకొన్నపుడు
లక్ష ఆశలు ఒక్క ఆశయంగా రూపుదిద్దుకొన్న సమయాన
సభ - నియంత ముఖానికిపట్టిన ముచ్చెమట అవుతుంది
జైత్రయాత్ర అవుతుంది
జనవిజయానికి ఆచరణ ఇచ్చిన హామీ అవుతుంది
నిజం! సభ - శత్రువుపాలిట గోరీ అవుతుంది!

—"శో.ప్ర."

# 'శాంబ' వేదిక మీద పోలీసు పెళ్ళి

—కె. ఎస్. చారి, వసంతలక్ష్మి

ఆవేళ 'తెలుగు' పోలీస్‌స్టేషన్‌లో పెళ్ళి జరుగుతోంది. స్టేషన్ ప్రాంగణమంతా కోలాహలంగా కనిపిస్తోంది. ఖాకీమూకలు విచ్చలవిడిగా సంచరిస్తున్నాయి. పోలీసులు తెలుగుపౌరుల పెళ్ళిచేస్తున్నారన్న వార్త దావానలంలా వ్యాపించిపోయి ఆంధ్రదేశమంతా అట్టుడికిపోతోంది. ఆపరేషన్ 'ఎల్లోస్టార్' ప్రారంభమయినట్టు పోలీసు జాగిలాలు పటాలాలు పటాలాలుగా 'మంట'పానికి చేరుతున్నాయి.

కరీంనగర్ జిల్లాలో పీకేసిన ఇళ్ళుతెచ్చి పందిరేశారు. ఆదిలాబాద్ జిల్లా గిరిజనుల తోళ్ళువొలిచి తోరణాలుకట్టారు. కల్లోలితప్రాంతం నుంచి కిరోసిన్‌లో నానేసితెచ్చిన నవధాన్యాలు చూర్ణం చేసి ప్రాంగణమంతా ముగ్గులుపెట్టారు. ఎన్‌కౌంటర్ శవాలనుంచి సేకరించిన పచ్చినెత్తురుతో కళ్యాణ'శాంబ' వేదికను అలంకరించారు. పందిట్లో ఖాకీవిశ ఈడ్చికొడుతోంది.

నిజామాబాద్ నుంచి 'బాయ్‌నెట్ల' బాజాలు వచ్చాయి. ఎదురైనవాళ్ళు, ఎదిరించినవాళ్ళు, అడ్డమైనవాళ్ళు, అడ్డగించినవాళ్ళ అందరిడొక్కలు చించి కట్టిన డోళ్ళు వరంగల్ నుంచి వచ్చాయి. ఖాకీమేళం సిద్ధమైంది. ఈ కల్లోలమంతా చూసి పెట్రేగిపోయిన ఖాకీమూకలు లాఠీనృత్యం చేయసాగాయి.

ఆంధ్రదేశం నలుమూలలనుంచి వచ్చి మోహరించిన ఖాకీగుంపులు వధూవరులను చుట్టుముట్టాయి. ఒకమూక పెళ్ళికొడుకును అర్ధనగ్నంచేసి ఊరేగించాయి. కాలిగోళ్ళుపీకి, వేలిగోళ్ళలో గుండుసూదులుగుచ్చి తలకిందులుగా వేలాడదీశాయి. ఇంకోగుంపు వేలాడదీసిన పెళ్ళికొడుకు కింద ముంతపొగ రాజేశాయి.

బెజవాడభటులు మాత్రం పెళ్ళికూతురు తలనీలాలు తీయడంలో నిమగ్నమైపోయారు. రాష్ట్రం నలుమూలల నుంచి పోగుచేసి తెచ్చిన 'రోకలిబండల ముసళ్ళ'తో వధూవరులిద్దరినీ నలగ్గొట్టి నలుగుపెట్టి 'మంటల' స్నానం చేయించారు. అంతాకలిసి ఆమందానందంతో పెళ్ళికూతురు కళ్ళకు కారందిద్ది సిగరెట్లతో బుగ్గమీద 'సిగ్గుబొట్టు' అద్దారు. రంపచోడవరం నుంచి తెచ్చిన 'రక్త' చందనాలతో కళ్యాణతిలకం దిద్దారు.

వధూవరులకు 'బెలుబాసికాలు' బిగించారు.

'మంట'పమంతా ఖాకీ రెపరెపలతో 'మెడళ్ళ' ధగధగలతో 'కలకల'లాడుతోంది. ముందువరసలో ఎన్‌కౌంటర్ యమధర్మరాజులు, లాకప్‌హత్యల లబ్ధప్రతిష్టులు, మానభంగ మహారథులు, శిరోముండన శిఖామణులు- వారివారి స్థానాల్లో ఆసీనులై వున్నారు. లాఠీచార్జి ఘనాపాఠీలు, బాష్పవాయువు భగీరథులు, పెట్టీకేసుల ప్రధానులు, పాకెట్‌మార్ దొరలు, సీతాకేసుల సిసింద్రీలు వెనక దన్నుగా నిల్చున్నారు. ఇంతలో స్టెన్‌గన్ వేగంతో, 'కనిపిస్తే కాల్చివేసే' ఉత్సాహంతో కల్లోలితప్రాంతం నుంచి ఖాకీదండు కదిలొచ్చింది. ఆ దండు తెచ్చిన ధయిర్యంతో 'కన్యాదహన' కార్యక్రమం ప్రారంభమయింది.

కోటిఆశల కొనవూపిరితో వున్న తండ్రిలేని ఆడపడచును తెలుగన్న 'శాంభవేదిక' మీదికి తోశాడు.

'బాయ్‌నెట్ల' బాజాలు వెంటనే భయంకరంగా మోగాయి.

చావుడప్పులు గుండెలుపగిలేలా ధభధభలాడాయి.

డోళ్ళ డొక్కలు పగిలిపోయాయి.

సన్నీసన్నాయిలు శివమెత్తి అరిచాయి. ఖాకీ పురోహితులు మంత్రాలకు లంకించుకున్నారు. వధూవరులచేత గోల్కొండ గోళీలు మింగించి, మూత్ర తీర్థాన్ని తాగించారు. ఖచ్చితంగా ముహూర్తం సమయానికే 'ఉరిసూత్రం' బిగిసింది. వధూవరులచేత తూటాలమాలలు మార్పించారు. చింతపల్లి ఏజెన్సీ ప్రాంతంలో అడవినుంచి అక్రమంగా అంటించి తెచ్చిన చింతనిప్పులతో తలంబ్రాలు పోయించారు. పిల్ల మేనమామ సమంతుడు పెళ్ళికూతురు కాలివేళ్ళునరికి మెట్టెలు తొడిగాడు. మేనమామ ఆత్మీయతకు పెళ్ళికూతురు ఆనందంతో ఆర్తనాదం చేస్తూవుంటే, పెళ్ళికొడుకు ఆక్రోశిస్తూవుంటే వారికి గంధకధూమంతో హారతిపట్టారు. 'సర్కిల్'పూజార్లు సంబరంగా వారిని ఏడేడు పోలీసుస్టేషన్లు తిప్పి సప్తపది కానిచ్చారు. 'సుకుమార' ఆకాశాల అంచుల్లో 'అరవింద' నక్షత్రాల్ని చూపించి 'అశోక'వృక్షం కింద కూచోబెట్టి కొత్తదంపతులకు కొరివి పెట్టారు.

పోలీసుల ఆహ్వానాలను అందుకుని కన్యాదహన కార్యక్రమానికి విచ్చేసిన 'ఫియర్‌వికాస్' పెళ్ళిపెద్దలు సంబరపడిపోతూ చదివింపులకు ఖాకీకారం చుట్టారు. ఆరు హత్యకేసులు, ముచ్చటగా మూడు దొంగతనంకేసులు పెళ్ళికొడుక్కు చదివించారు. స్థిరాస్తిగా స్టూవర్ట్‌పురం సెటిల్‌మెంట్ ఇచ్చారు. పెళ్ళికొడుకు భవిష్యత్తును దృష్టిలోవుంచుకుని టెర్రరిస్టు చట్టసంపదను అతని పేర

వ్యాసం :

# హరిత విప్లవం అసలు రంగు

—ఎస్. చంద్రశేఖర్

భారత ప్రభుత్వం చేపట్టిన అనేక పథకాలలో బహుళ ప్రచారం పొందింది హరిత విప్లవం. దేశానికి వెన్నెముక అయిన రైతాంగానికి తాము చేసిన ఘనమైన సేవగా పాలకులు గర్వంగా చెప్పుకునేది హరిత విప్లవం. వ్యవసాయరంగ అభివృద్ధికి భారత ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికా స్వరూపమే ఇది. వేగంగా అభివృద్ధిచెందుతున్న సాంకేతిక పరిజ్ఞానంతో సంబంధం లేకుండా శతాబ్దాలుగా, వెనుకబడిన, పురాతన పద్ధతులలోనే సాగిపోతున్న భారత వ్యవసాయాన్ని ఆధునిక పద్ధతులకు మళ్ళించడానికి కాంగ్రెసు ప్రభుత్వంచే రచించబడిన బృహత్తర వ్యూహం ఇది. ఒక్కమాటలో పాలకుల ప్రచారాన్ని చెప్ప

---

రాసిపెట్టారు. 'రెడ్‌లైట్ వవ్యప్రాంతాల మెహందీ'వి పెళ్ళికూతురుపేర రాస్తూ ఆడపడుచుకు అరటింకింద కుటుంబ భద్రత, నిత్యావసర చాకిరీసారెతో వాడివింపారు. ఆ స్త్రీహత్యకింద అగ్నిప్రమాదాలను, కిరోసిన్‌మంటలను రాసిచ్చారు.

అప్పటికప్పుడే జరూరుగా శోధనం జరిగిపోవాలని రాజసదనం నుంచి వైర్‌లెస్ సందేశాలు రావడంతో కాస్త హడావిడి పెరిగిపోయింది. అప్పగింతల వ్యవహారం తర్వాత చూసుకోవచ్చులే అని రాత్రికి రాత్రే నూతన దంపతులను పోలీసులు లాకప్‌పడగ్గదిలోకి తోశారు.

మూడు ఖాకీకాళరాత్రులు గడిచిపోయాయి.

లాకప్‌తలుపులు తెరిచారు. అనుకున్నట్టుగానే పెళ్ళికూతురు శవంగా మారిపోవడంతో ఉత్సాహపడిపోయిన పోలీసులు అనాథప్రేతంగా జమకట్టి పెళ్ళికూతురు శవాన్ని తగులపెట్టారు. పెళ్ళికొడుకు శవం మాత్రం కనిపించలేదు. ఇది ఖచ్చితంగా మాచెర్ల మూకలపనే అయివుంటుందని భావించి అంతా తుపాకీగుళ్ళను గుండెలనిండా పేర్చుకుని ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

తెలుగు 'శాంథ'వేదిక మీద పెళ్ళికూతురు శవం కాలుతూనే వుంది!

మాయమైన తన కొడుకు శవంకోసం ఒకతల్లి ముక్కోటిదేవుళ్ళను తిట్టిపోస్తూ వెతుకుతూనేవుంది!

(రచనాకాలం : డిసెంబర్, 1988)

వలసి వస్తే- వ్యవసాయరంగం, వ్యవసాయదారులు ఎదుర్కొంటున్న అన్ని సమస్యలకు పరిష్కారం హరిత విప్లవం.

అంతేకాక బ్రిటీషువాళ్ళు మనదేశాన్ని వదలివెళ్ళిన తిరువాత వ్యవసాయరంగంలో పాలకులు ప్రవేశపెట్టిన మౌలిక సంస్కరణ హరితవిప్లవం. పంటలు, భూములు అనగానే హరితవిప్లవ విజయ పరంపరల గురించి ఊదరగొట్టని రాజకీయ నాయకుడుండడు. ఈ పూర్వరంగంలో హరితవిప్లవం అంటే ఏమిటి? హరిత విప్లవాన్ని ఎట్లా పరిశీలించాలి? వ్యవసాయరంగంలో అభివృద్ధి ఏవిధంగా ఉండాలి? హరితవిప్లవం సాధించింది ఏమిటి? వ్యవసాయంలో సాధించామని చెప్తున ప్రగతికి హరితవిప్లవం ఎంతవరకు కారణం? పంజాబ్ లో జరిగిందేమిటి? దీనిలోని లోపాలు ఏమిటి? ఎందుకు ఆశించిన ఫలితాలను సాధించలేకపోయింది? ఎటువంటి పరిస్థితులుంటే హరితవిప్లవం విజయవంతం అవుతుంది. అనే ప్రశ్నలను పరిశీలించడం అవసరం. అపుడే ఒక సమగ్రమైన దృక్పథాన్ని ఏర్పరుచుకోగలం.

భారతదేశం వ్యావసాయిక దేశం. మన దేశంలో 80 శాతం ప్రజలు గ్రామాల్లో జీవిస్తుండగా, 70 శాతం వ్యవసాయంపై ఆధారపడి ఉన్నారు. మన దేశం బ్రిటీషువారి ఆక్రమణ క్రింద ఉన్న రోజుల్లోనూ, వారు నిష్క్రమించి నల్లదొరలు అధికారంలోకి వచ్చిన తర్వాతకూడా పారిశ్రామికంగా వెనుకబడిన దేశమే. అక్కడక్కడ కొన్ని పరిశ్రమలు నెలకొల్పబడినప్పటికీ, అవి మెజారిటీ ప్రజల అభివృద్ధికి రచించబడిన ఒక సమగ్ర వ్యూహంలో భాగంగాకాక, సామ్రాజ్యవాదుల అవసరాలకు అనుగుణంగా మాత్రమే ఏర్పడ్డాయి. 1947 తర్వాత జరిగిందని చెప్పబడుతున్న పారిశ్రామికీకరణ కూడా ఇందుకు మినహాయింపు కాదు. ప్రకృతివైపరీత్యాల వలన వ్యవసాయంలో వచ్చే ఒడిదుడుకులు మన ఆర్థికవ్యవస్థను నిర్ణయాత్మకంగా ప్రభావితం చేయగలగటానికి కూడా కారణం ఇదే!

ఈ పరిస్థితులలో మన ఆర్థికవ్యవస్థను పటిష్ఠం చేసి ప్రజల జీవన స్థితిగతులలో మార్పు సాధించాలంటే వ్యవసాయరంగాన్ని అభివృద్ధిచేయటం అత్యంత ప్రాముఖ్యం కలిగిన అంశం. దేశ భవిష్యత్తుకు గ్యారంటీ వ్యవసాయాభివృద్ధి. వ్యవసాయాన్ని అభివృద్ధిచేయటం అంటే వ్యవసాయంమీద ఆధారపడిన ప్రజల జీవన స్థితిగతులను అభివృద్ధిచేయటమే!

భారత వ్యవసాయరంగాన్ని పరిశీలిస్తే మన దృష్టికి వచ్చేవి రెండు ప్రధానమయిన అంశాలు- ఒకటి వ్యవసాయంపై ఆధారపడిన వారిలో అత్య

ధికులు పేదరైతులూ, వ్యవసాయ కూలీలు. సంఖ్యరీత్యా వీరు మెజారిటీ (దాదాపు 80 శాతం) అయినప్పటికీ, వీరి చేతిలో ఉన్న భూమి శాతం అతి స్వల్పం (దాదాపు 20 శాతం). మరొకవైపు, అతి తక్కువమందిగా ఉన్న (10 శాతం) భూస్వాములు అత్యధిక శాతం భూమిపై ఆధిపత్యం చెలాయిస్తున్నారు. మధ్య తరగతి రైతులలో సహకూలీలను, పేదరైతులను తీవ్రమయిన దోపిడీకి, పీడనకు గురిచేస్తున్నారు. ఈ క్రమంలోనే ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టి ఉత్పత్తిని పెంచటానికి అవరోధంగా నిలుస్తున్నారు. ఇది మొదటి అంశంకాగా మరొక ముఖ్యమైన అంశంకూడా ఉంది. అదే "వెనుకబడిన వ్యవసాయ పద్ధతులు". ఇక్ష్వాకుల కాలంనాటి కొయ్యనాగలే ఈనాటికీ మన దేశ రైతుకి ప్రధాన పనిముట్టు. ఆధునిక వంగడాలు, ఎరువులు, పురుగుమందుల వాడకం, తెలియని ప్రాంతాలు కోకొల్లలు. ఏడు పంచవర్ష ప్రణాళికలు అమలుజరిగినాక కూడా సాగునీటి సౌకర్యం కలిగిన భూమిశాతం 30 కి మించలేదు. ఇవన్నీ ఉత్పత్తి శక్తుల వెనుకబడిన వైనాన్ని సూచిస్తున్నాయి. స్పష్టంగా చెప్పాలంటే- ఉత్పత్తిశక్తులు, ఉత్పత్తిసంబంధాలు రెండూ కాలంచెల్లిపోయి మార్పుకోసం ఎదురుచూస్తున్నాయి.

పై రెండు అంశాలను దృష్టిలో ఉంచుకుని అభివృద్ధిచెందిన ఉత్పత్తి శక్తులను అమలుచేయటానికి అవసరమయిన న్యాయమయిన భూమి సంబంధాలను ప్రతిష్టించి, ఉత్పత్తిశక్తులను, సంబంధాలను సమన్వయించుకుంటూ ముందుకు పోయేదే అభివృద్ధి. అప్పుడు మాత్రమే మన రైతాంగం సమస్యలు తీరుతాయి. కపీసం పాలకులు నెత్తినోరూ బాదుకుంటున్నట్లు . ఆహారధాన్యాలలో స్వయం సమృద్ధి సాధించటానికి అయినా ఇది ముందు షరతు. వాస్తవాలతో సంబంధం లేకుండా, అనేక వక్రీకరణలతో దోపిడీప్రభుత్వ రాజకీయ విధానాలకు లోబడి పనిచేసే మన వ్యవసాయార్థిక శాస్త్రవేత్తలు పైతం పాలకుల విధానాలకు వ్యతిరేకంగా పై నియమాలను నిరూపించే పరిశోధనలు ప్రకటించారంటే, ఆశ్చర్యమే? ఈ విషయాన్ని ప్రస్తుతానికి ప్రక్కనపెట్టి ప్రభుత్వం చెప్పే అర్థంలో హరితవిప్లవం అంటే ఏమిటో చూద్దాం!

హరితవిప్లవం అంటే ప్రధాన ఆహారపంటలయిన గోధుమ, మొక్కజొన్న, సజ్జ, వరి, రాగి వగైరా పంటల సాగుబడిలో ఆధునిక వ్యవసాయ పద్ధతులను ఉపయోగించడం ద్వారా ఉత్పత్తిని పెంచటం. అధికదిగుబడి వంగడాలు, ఎరువులు, పురుగుమందుల వాడకం, ఆధునిక వ్యవసాయ పరికరాలు,

సాగునీటి సౌకర్యం కల్పించటం. డీజెల్ మరియు ఎలక్ట్రిక్ పంపుల వాడకం-ఈ ఆధునిక పద్ధతుల్లో కొన్ని. ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే 1960 వ దశాబ్దంలో ఇందిరమ్మ ప్రవేశపెట్టిన సాంద్రవ్యవసాయ పథకం (ఐఎడిపి), అధిక దిగుబడి వంగడాల పథకం (హెచ్‌వైవిపి), బహుళ పంటల పథకం (ఎంసిపి) వంటి వ్యవసాయాభివృద్ధి పథకాల ద్వారా సాధించిన సమిష్టి అభివృద్ధే హరిత విప్లవంగా చెప్పబడుతున్నది.

హరితవిప్లవానికి పునాది ఫోర్డు ఫౌండేషన్ కమిటీ సిఫార్సులు ఫోర్డు ఫౌండేషన్ అంటే అత్యంత హేయమైన పద్ధతుల్లో వెనకబడిన దేశాల ప్రభుత్వాలను, అధినేతలను లోబర్చుకుని ఆయా దేశాల ప్రజల శ్రమశక్తిని కొల్లగొట్టడంలో యూనియన్ కార్బైడ్ తాతలాంటి బహుళజాతి సంస్థయని దిన పత్రికలతో పరిచయం ఉన్న వారికెవరికయినా తెలిసే ఉంటుంది. అప్పటి మన పాలకుల అభిప్రాయం ప్రకారం స్వాతంత్ర్యం వచ్చిన 15 సంవత్సరాల కాలంలో దేశం వ్యవసాయరంగంలో అవసరమయినంత పురోభివృద్ధిని సాధించలేకపోయాము! ఆహారధాన్యాలరంగంలో స్వయంసమృద్ధిని సాధించలేకపోయాము! అందువలననే విదేశీమారకద్రవ్యాన్ని పారిశ్రామికీకరణకు అవసరమయిన భారీయంత్రాలను కొనుగోలుచేయటానికి వినియోగించలేకపోతున్నాం ఈ పరిస్థితిని సరిదిద్ది వ్యవసాయోత్పత్తిని వేగంగా పెంచటానికి కావలసిన పథకాన్ని సూచించమని భారత ప్రభుత్వం ఫోర్డ్ ఫౌండేషన్‌ను అర్థించింది.

మన దేశ వ్యవసాయరంగ అభివృద్ధి నత్తనడక నడుస్తుంది అనటంలో పాలకుల అభిప్రాయంతో ఎవరికీ ఎటువంటి పేచీ ఉండనక్కరలేదు. అది అక్షర సత్యమే. కఠిన వాస్తవమే. ఆ విషయాన్ని నిరూపించటానికి అంకెలు, గణాంకాలు, తర్క వితర్కాలేమీ అవసరం లేదు. ఆశ్చర్యం అంతా పరిస్థితిని మదింపు చేయటానికీ, అవసరమయిన సూచనలు చేయటానికి ఒక విదేశీ బహుళజాతి సంస్థ పంపిన కమిటీ అవసరం కావటంలోనే ఉంది. మన దేశ ప్రజలకు ఏది అవసరమో ఏది కాదో మనం నిర్ణయించుకోలేమా? అలా నిర్ణయించుకోవటానికి అవసరమయిన సాంకేతిక నిపుణులు మనకు లేరా? ప్రపంచంలోనే అత్యధిక సాంకేతిక నిపుణులను కలిగిన దేశాల్లో అమెరికా, రష్యాల తర్వాత మూడవది అయిన మన దేశంలో అలాంటి కొరత ఉందనటం పచ్చి అబద్ధం మాత్రమే.

మన దేశంలో అభివృద్ధి మన ప్రజల అవసరాలనుబట్టి ఎప్పుడూ జరగలేదు. అది ధనస్వాములకు వారి విదేశీ మిత్రులకు అనుకూలంగా ఉంటుంది. ఫోర్డ్ ఫౌండేషన్ కమిటీ నియామకం ఈ క్రమంలో భాగమే. ఈ పద్ధతుల్లో నియమింపబడిన ఫోర్డ్ ఫౌండేషన్ కమిటీ రిపోర్టుకు సామ్రాజ్యవాద మూస నుండి ఊడిపడిందానికి ఉండాల్సిన లక్షణాలన్నీ సహజంగానే ఉన్నాయి. ఆ కమిటీ విశ్లేషణ ప్రకారం భారతదేశంలో వ్యవసాయరంగం (వ్యవసాయరంగమేకాని వ్యవసాయరంగంమీద ఆధారపడిన ప్రజలుకాదు. వారి స్థితిగతులు అప్రస్తుతం లేదా అనవసరం అనుకుని ఉండవచ్చు.) వెనుకబడి ఉండటానికి కారణం అన్ని ప్రాంతాలను ఒకేసారి అభివృద్ధి చేయాలనుకోవడమే! అందుబాటులో ఉన్న పరిమిత వనరులను అన్నిచోట్లా ఉపయోగించి ఎక్కడా ఫలితాలను సాధించలేకపోవటమే! ఈ పరిస్థితిని సరిదిద్ది స్వయంసమృద్ధిని సాధించటానికి తయారుచేసిన చిట్కాయే సాంద్ర వ్యవసాయం. సాంద్ర వ్యవసాయం అంటే వ్యవసాయానికి అనుకూలమయిన పరిస్థితులు - సారవంతమైన భూమి, వర్షపాతం, సాగునీటి సౌకర్యం కలిగివున్న ప్రాంతాలలో కేంద్రీకరించటం. అందుబాటులో ఉన్న వనరులను ఆ పరిమిత ప్రాంతాలలో మాత్రమే వినియోగించటం. ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పనిముట్లు, అధిక దిగుబడి వంగడాలు, ఎరువుల వాడకాన్ని ప్రోత్సహించటానికి ఋణసౌకర్యాలు కల్పించటం వగైరాలు ఆ ప్రాంతాలలో విస్తృతంగా చేపట్టడం. మిగతా ప్రాంతాలలో భూములు సాగునీటి సౌకర్యంలేక ఇసుకపర్రలయినా, ప్రజానీకం ఆకలిచావులకు గురయినా పట్టించుకోవలసిన అవసరంలేదు. ఆహారధాన్యాల ఉత్పత్తిని దేశం మొత్తానికి అవసరమయేంతగా పండిస్తే చాలును. అందరికీ అందినా అందకపోయినా, కొనగలిగే శక్తి ఉన్నా లేకపోయినా ఫరవాలేదు. కొన్ని ప్రాంతాలలోనయినా ఎరువులు, పురుగుమందులు, అభివృద్ధిచెందిన వంగడాలు, అధిక పనిముట్లు వగైరా వాడాలి. దీనిద్వారా సామ్రాజ్యవాదుల, వారి భారత మిత్రుల వస్తువులు అమ్ముడుపోవాలి. అంతేకాదు, ఈ వస్తువులను కొనవలసినది ఎటుతిరిగి నిరుపేద రైతాంగమే కనుక, ఈ వస్తువులను కొనటానికి కల్పించే రాయితీల బరువు మోయాల్సింది వారే కనుక వారికికూడ ఆమోదయోగ్యమయ్యే పద్ధతి కావాలి. దానికి సామాన్య జనాన్ని ఆకర్షించే శక్తి కావాలి! అందమయిన నినాదరూపంలో ఉంటే మరీ మంచిది. అలాంటి నినాదరూపమే "హరిత విప్లవం". అందుకనుగుణంగానే కమిటీ సిఫార్సులుకూడా ఉండాలి. ఉన్నాయికూడా.

భారత ప్రభుత్వం దీన్ని యథాతథంగా ఆమోదించింది. మొదటి విడతగా 1960-61 లలో 7 జిల్లాలను సాంద్ర వ్యవసాయ జిల్లాలుగా ప్రకటించింది. ఆ 7 జిల్లాలలో మన పశ్చిమ గోదావరి జిల్లా ఒకటి. దీనినే సాంద్ర వ్యవసాయ జిల్లాల పథకం (ఐఎడిపి) అంటారు. తరువాత 1966 లో అధిక దిగుబడి వంగడాల పథకం (హెచ్‌వైవిపి), 1967 లో బహుళ పంటల పథకం (ఎమ్‌సిపి) లను ప్రకటించింది. వీటిని దేశవ్యాప్తంగా కొన్ని ప్రాంతాలలో అమలుచేయటానికి చర్యలు తీసుకుంది. ఈ పథకాల అమలుద్వారా వ్యవసాయ రంగంలో అభివృద్ధిని సాధిస్తామని చెప్పింది. ఈ అభివృద్ధికే 'హరితవిప్లవం' అని పేరుపెట్టింది.

హరితవిప్లవం అంటే భూసంస్కరణలను గురించిగాని లేక దేశమంతా విస్తృతస్థాయిలో మార్పులను తేవటానికి అమలుచేయబడిన పథకాలనో భావించటం సహజం. అయితే ఇలాంటివేమీ లేకుండా కేవలం దేశంలోని అత్యల్ప ప్రాంతంలో కొద్దిపాటి వనరులతో ప్రారంభించబడిన వ్యవసాయాభివృద్ధి పథకాలకు 'విప్లవం' అని పేరుపెట్టడం ఎంతవరకు సమంజసం అనేది చర్చించవలసిన విషయమే.

అయితే ఎన్ని లోపాలున్నప్పటికీ హరిత విప్లవం కొన్ని విజయాలను కూడా సాధించింది. సాంప్రదాయక వ్యవసాయ పద్ధతుల స్థానంలో ఆధునిక పద్ధతుల ఉపయోగాన్ని, విలువను రైతాంగంలో పరిమితంగానే అయినా గుర్తింపచేయగలిగింది. అన్నిటికంటే ముఖ్యంగా ఆహారధాన్యాల విషయంలో కొంతవరకు స్వయంసమృద్ధిని సాధించి విదేశాలనుండి దిగుమతి చేసుకోవలసిన అవసరాన్ని తగ్గించింది. మొదటగా హరిత విప్లవ విజయాలుగా చెప్పబడే వాటిని విశ్లేషిద్దాం.

హరితవిప్లవం సాధించిన విజయాలలో చెప్పుకోదగినది ఆహారధాన్యాల ఉత్పత్తిలో సాధించిన ప్రగతి. మరీ ముఖ్యంగా వరి, గోధుమ పంటలలో ఇది కనబడుతుంది. మొదటి దశలో అంటే 1960 లలో వరి ఉత్పత్తి, దిగుబడులలో చెప్పుకోదగిన మార్పులేనప్పటికీ, 1973-74 తర్వాత ఈ పరిస్థితిలో మార్పు రావటం ప్రారంభమయింది.

ఆహారధాన్యాల ఉత్పత్తిలో సాధించిన అభివృద్ధి (మిలియన్ టన్నులలో)

| పంట | 1960-61 | 1970-71 | 1983-84 |
|---|---|---|---|
| వరి | 35 | 42 | 59 |
| గోధుమ | 11 | 24 | 45 |
| పప్పుదినుసులు | 13 | 12 | 13 |
| తిండిగింజలు (అన్నీ కలిపి) | 69 | 96 | 139 |
| మొత్తం ఆహారధాన్యాలు | 82 | 108 | 151 |

(భారత ప్రభుత్వం, వ్యవసాయ మంత్రిత్వ శాఖ వార్షిక నివేదిక 1984-85 ఆధారంగా)

పై పట్టికను పరిశీలిస్తే వరి ఉత్పత్తి 1960-61 లో 35 మిలియన్ టన్నులనుండి 1983-84 లో 59 మిలియన్ టన్నులకు పెరిగింది ఇదేకాలంలో వరి దిగుబడి హెక్టారుకు 1013 కిలోలనుండి 1851 కిలోలకు పెరిగింది. అలాగే గోధుమ దిగుబడి 1960-61 లో 11 మి.ట. నుండి 1983-84 లో 45 మి.ట.లకు పెరిగింది. అంటే గోధుమ ఉత్పత్తి ఈ 25 ఏళ్ళలో 3 రెట్లు పెరిగింది. గోధుమ దిగుబడి 1960-61 లో హెక్టారుకు 851 కిలోలు ఉండగా 1983-84 లో అది 1851 కిలోలకు పెరిగింది. మొత్తంగా ఆహారధాన్యాల ఉత్పత్తి 1960-61 లో 82 మి. టన్నుల నుండి 1983-84 నాటికి 151 మిలియన్ టన్నులకు చేరుకుంది. అంటే దాదాపు రెట్టింపు అయింది.

మారిన వ్యవసాయ విధానంయొక్క ప్రభావం 1967-68 – 1970-71 మధ్యకాలంలో అధికంగా (అంటే 4.8% పెరుగుదల) కనబడుతుంది. ఈ కాలం అంతాకూడా వర్షపాతంలో అతివృష్టి, అనావృష్టి లేకుండా సాగినకాలమే.

గోధుమ (12.1%), చెఱకు (11.4%) పంటల అభివృద్ధి రేటు గణనీయం కాగా ప్రధాన ఆహారధాన్యమైన వరి విషయంలో ఇది చాలా నిరాశాపూరితంగా సాగింది (3.9%). అన్నిటికంటే దారుణం అయిన విషయం ఏమంటే కందులు, జూట్, ప్రత్తి పంటల విషయంలో పెరుగుదల రేటు పడిపోవడం. ఫలితంగా వాటిని దిగుమతి చేసుకోవలసిన దుస్థితికి నెట్టబడటం. అంటే మన దేశ ప్రజలకు అవసరమయిన పంటలనన్నింటినీ అభివృద్ధిపరచటం కాక కేవలం కొన్ని పంటలనే అభివృద్ధి చేయటం జరిగింది.

హరిత విప్లవంలాంటి ఎటువంటి నూతన మార్పులు ప్రవేశపెట్టబడని 1949-50 – 1964-65 మధ్యకాలంలో ఆహారధాన్యాల విషయంలో 2.8 శాతం అభివృద్ధి రేటు సాధ్యం అయింది. అయితే విప్లవం వచ్చిందంటూ మన పాలకులు బాకాలూదిన 1970-71 – 1981-82 మధ్యకాలంలో సాధించిన అభివృద్ధి రేటు 1.9 శాతం మాత్రమే. మొదటి దశలో (1967-68 – 1970-71 మధ్య) మాత్రమే ఇది 4.8 శాతంగా ఉంది. అంటే...

ఆహారధాన్యాల విషయంలో సాధ్యమయిన అభివృద్ధికి పాలకులు అమలు చేసిన హరిత విప్లవ ప్రభావం ఎంత? కొత్తగా సాగులోకి తేబడిన ప్రాంతం ద్వారా వచ్చి చేరినదెంత? అనేది చర్చనీయాంశమే.

అలాగే భారత వ్యవసాయ ఉత్పత్తి స్వభావంలోకూడా చెప్పుకోదగినంత మార్పు రాలేదు. కేవలం 30 శాతం కంటే తక్కువ మాత్రమే సాగునీటి సౌకర్యం కలిగిన మన దేశంలో వ్యవసాయం లాటరీ లాంటిది. వర్షం ఉంటే పంటలు పండటం, లేకపోతే పండకపోవటం, తిండిగింజల కొరత ఏర్పడటం, ఆకలిచావులు సంభవించటం జరుగుతున్నదే. ఈ పరిస్థితిని మార్చటానికి హరిత విప్లవం చేసింది ఏమీలేదు. ఆహారధాన్యాల ఉత్పత్తి 1970-71 లో 108 మిలియన్ టన్నులు ఉండగా కరువు సంవత్సరం అయిన 1972-73 లో అది 95 మి. టన్నులకు పడిపోయింది 1978-79 లో 132 మి. టన్నులు కాగా 1979-80 లో అది 108 మి. టన్నులకు పడిపోయింది. అంటే 1970-71 లోని పరిస్థితి పునరావృతం అయింది.

ఆహారంలో తిండిగింజలకు ఎలాంటి ప్రాధాన్యత ఉందో పప్పుదినుసులకు కూడా అంతే ప్రాధాన్యత ఉంటుంది. అయితే నూతన మార్పుల ప్రభావం కేవలం గోధుమ, మొక్కజొన్న, సజ్జ, వరి పంటలకు మాత్రమే పరిమితం అయింది. పప్పుదినుసుల ఉత్పత్తి 1960-61 లో 13 మి టన్నులు ఉండగా 1988-89 లో అది 11 మి. టన్నులకు పడిపోయింది. ఆహారధాన్యాలలో పప్పుదినుసుల ఉత్పత్తి శాతం 1960-61 లో 16 శాతం ఉండగా 1988-89 లో కేవలం 8 శాతానికి పడిపోయింది. అంతేకాకుండా హరితవిప్లవ ప్రభావం బార్లీ, రాగి ఇతర చిరుధాన్యాల విషయంలో శూన్యం.

ఒనగూడిన ఆర్థిక ప్రయోజనాలను అవి ఎంత స్వల్పమయినా పొందేది ఎవరు అనేది అసలు ప్రశ్న. ఈ సందర్భంగా ప్రధానంగా చెప్పుకోవలసింది భూసంబంధాలలో అంటే గ్రామీణ ప్రాంతాలలో నెలకొనివున్న భూమికి సంబం

ధించిన అసమానతలలో వచ్చిన మార్పులగురించి ఈ 20 సంవత్సరాల కాలంలో ఉన్న కొద్దిపాటి భూమినికూడా పోగొట్టుకొని వ్యవసాయ కూలీలుగా మార్చివేయబడ్డ వారిగురించి మన పాలకులు చేపట్టిన అభివృద్ధి క్రమంలో భాగంగానే మన ప్రజలమీద రుద్దబడిన హరిత విప్లవం మేలుకంటే కీడే ఎక్కువ చేసింది. ప్రముఖ వ్యవసాయ ఆర్థికశాస్త్ర నిపుణులు డాక్టర్ వి.ఆర్. కె.వి. రావుగారి మాటల్లో "ఆహారధాన్యాల ఉత్పత్తిని పెంచటానికి దేశానికి ఉపయోగపడిన హరిత విప్లవం అనేకమంది సన్నకారు రైతులు భూములు కోల్పోవడానికి, వ్యవసాయ కూలీలుగా మారటానికి దారితీసింది. ఫలితంగా గ్రామీణ ప్రాంతాలలో ఉద్రిక్తతలు పెరిగాయి."

ట్రాక్టర్లు, పవర్ టిల్లర్లు, పవర్ స్ప్రేయర్లు, థస్టర్లు, సింథటిక్ పైర త్రాయిడ్స్ వంటి వ్యవసాయ సాధనాలను ఎంతమంది రైతులు కొనగలరు? లేదా ఉపయోగించగలరు? నారు కొనటంతో మొదలుపెట్టి సాగుబడికి భూస్వామి వద్దనుండో మరో ప్రైవేటు వ్యక్తిమండో అత్యధిక వడ్డీరేట్లతో డబ్బు అప్పుగా తెస్తేతప్ప వీలుగాని పరిస్థితి మనదేశ సగటు రైతుది. సొంత పశువుల ఎరువును జల్లి అరకతో సేద్యంచేసే సగటు రైతు వాటి స్థానంలో రసాయనిక ఎరువులు, ట్రాక్టర్లను ప్రవేశపెట్టటానికి అయ్యే ఖర్చు భరించటం ఎట్లా? దానికి ఇంకా అప్పు చేయటం అంటే వడ్డీ వ్యాపారస్తుల కోరల్లో మరింతగా చిక్కుకుపోవడమే కదా! అందుకే దేశంలోని 80 మిలియన్ల వ్యవసాయ కుటుంబాల్లో 8 శాతంగా ఉండి 40 శాతం భూమిని చేజిక్కించుకున్న 'గ్రామరాజు'లే సాంకేతిక విజ్ఞానాన్ని సొంతంచేసుకుని తమ ప్రాబల్యం మరింత పెంచుకున్నారు.

మనం ప్రత్యేకంగా గమనించవలసిన మరో విషయం ఏమంటే నూతన వ్యవసాయ మార్పులపై రైతులకు అనేక అనుమానాలు ఉండటం. ఉదాహరణకు అధిక దిగుబడి వంగడాలనే తీసుకుంటే శాస్త్రవేత్తలు పరిశోధన క్షేత్రాల్లో పరీక్షించి విడుదలచేసే వంగడాలు ఎన్నోసార్లు రైతుల పొలాల్లో అవే ఫలితాలను ఇవ్వలేకపోయాయి. చీడపీడలకు లొంగిపోయాయి. ఇతర రైతుల పొలాల్లో ఇచ్చిన ఫలితాలనుబట్టి వాడాలనుకునేటప్పటికి విత్తనాల సమస్య మళ్ళీ ముందుకు వస్తుంది. చీడపీడలను నిరోధించటానికి విడుదల చేసిన వంగడాలు సైతం ఇంతే. వరిలో ప్రధాన సమస్య అయిన దోమకాటుగాని, గోధుమలో కాటుక తెగులుకాని, ప్రత్తిలో తెల్లదోమకుగాని తట్టుకొని నిలబడ

గల విత్తనాలు ఇంతవరకు విడుదల చేయలేకపోయామని శాస్త్రవేత్తలే చెబుతుంటారు.

ప్రభుత్వ అస్తవ్యస్త విధానాల పుణ్యమా అని సరయిన నాణ్యత లేని కంపెనీలన్నీ రంగంలోకి రావటం మూలంగా ఫలానా మందు ఈ వ్యాధిని కంట్రోలు చేస్తుందని చెప్పే పరిస్థితి లేకుండా పోయింది. ఫలితంగా రైతులు ఒకవైపు పంటకు వాటిల్లే నష్టంతోపాటు మందులమీద పెట్టే ఖర్చుకూడా తోడయి నికరాదాయం మరింత తగ్గిపోతుంది. 'ఇందులో హరిత విప్లవాన్ని తప్పుపట్టవలసిన అవసరం ఏముంది? సరయిన క్రిమిసంహారక మందులు దొరికితే మంచి ఫలితాలే వస్తాయికదా' అనే ప్రశ్న రావచ్చు. కాని అలా దొరకవు. ఇక్కడే టెక్నాలజీకి రాజకీయాలకు మధ్య ఉన్న సంబంధాల గురించి చర్చించవలసి వస్తుంది. ఇవి రెండూ విడదీయరాని విషయాలే. ప్రస్తుతం అమలులో ఉన్న ఉత్పత్తి సంబంధాలు, దానిని అమలుపరిచే ప్రభుత్వం ఎలాంటివి అన్నదాన్నిబట్టి టెక్నాలజీ ఫలితాలు ఉంటాయి. ఇసుకను ఏ బస్తాలో వేస్తే ఆ ఆకారంలో ఉంటుందికదా!

హరిత విప్లవం అనగానే స్ఫురించేది పంజాబ్. పంజాబ్‌లో హరిత విప్లవం గొప్పగా విజయవంతం అయిందని చెపుతుంటారు. ఈ ప్రచారం మన దేశంలో చాలా పెద్ద ఎత్తునే వుంది. పంజాబ్ అంటే సంపన్నవంతుల రాష్ట్రం అనే నమ్మకం చాలామందిలో బలంగా నాటుకుపోయింది. ఇది ఎంతవరకు వెళ్ళిందంటే చివరకు ప్రభుత్వ విధానాలను విమర్శనాత్మకంగా పరిశీలించాలనుకునేవారుకూడా పంజాబ్‌లో రైతుల అసమాన స్థితిగతులలో మౌలిక మార్పులు వచ్చాయి అనే పరిస్థితికూడా ఏర్పడింది కొండంత అబద్ధాన్నయినా పదేపదే చెప్తే వాస్తవం అవుతుందనే గోబెల్స్ సిద్ధాంతాన్ని తు చ. తప్పకుండ ఆచరించే మన నాయకుల ప్రచార ప్రభావమే అది! అందుకే నూతన సాంకేతిక మార్పులు పంజాబ్ రైతుల జీవన పరిస్థితిలో ఎలాంటి ప్రభావాన్ని కలుగచేశాయి అనే విషయాన్ని పరిశీలించటం అవసరం.

ఈ విషయంపై అశోక్ రుద్ర, తరీబ్, మజీద్‌లు సాగించిన పరిశోధనా ఫలితాలు ప్రభుత్వ ప్రచారంలో ఆవగింజంతయినా నిజంలేదని తేల్చివేశాయి. వివరాలు ఇలా వున్నాయి :

హరిత విప్లవం సాధించామని చెబుతున్న కాలంలోనే ధనిక రైతుల భూమి 9.5 శాతం పెరిగింది. ఇంకా వివరాలలోకి వెళితే, 20-25 ఎకరాల

కమతాలు 4 శాతం అభివృద్ధి చెందగా, 100-150 ఎకరాల మధ్యగల కమతాలు 40 శాతం పెరిగాయి. ఈ పెరుగుదలలో అత్యధిక శాతం పేద రైతులనుండి భూములను కొనటం వలన జరిగినవే! నూతన వ్యవసాయ మార్పులతోపాటే వచ్చి చేరిన మరో పరిణామం 'జంటిల్మన్ రైతుల' పెరుగుదల. ఫ్యూడల్ దర్పాన్ని వెలగబెడుతూ చేతికి మట్టి అంటకుండా, బట్టలు నలగకుండా వందల వేల ఎకరాల భూమికి యజమానులుగా చెలామణీ అయ్యే భూస్వాముల స్థానంలో లేదా వారికి జతగా మాజీ సైనికోద్యోగులు, పౌర అధికారులు, పట్టణాలలోని వ్యాపారులు, ఇతర ఆదాయ వనరులతోపాటు వీరికి వ్యవసాయంకూడ ఒక పరిశ్రమ. వ్యవసాయంలో పెట్టుబడి పెట్టడంద్వారా చౌకగా పేద రైతుల వ్యవసాయ కూలీల శ్రమశక్తిని కొల్లగొట్టడమేకాకుండా స్థిర పెట్టుబడినిసైతం చాలా వేగంగా అభివృద్ధిచేసుకోవచ్చనే విషయాన్ని వీరు గుర్తించారు. పంజాబ్ లోని భూమిలో ధనిక రైతులతోపాటుగా 27 శాతానికి వీరు యజమానులు

ఈ అభివృద్ధి క్రమాన్ని ఇలాగే కొనసాగిస్తే జరగబోయేది ఏమిటి? రాజీవ్‌గాంధీ చెపుతున్న సోషలిజమా? వి.పి. సింగ్ చెవుతున్న గ్రామ స్వరాజ్యమా? వీటిలో ఏదీ సాధ్యంకాకపోగా సదరు గ్రామరాజులు కొల్లగొట్టిన అదనపు ఉత్పత్తిలో కొద్దిపాటిగా రైతాంగంవద్ద మిగిలివున్న భూములనుకూడా లాక్కొని గ్రామీణ జనాభానంతటినీ వ్యవసాయ కూలీలుగా మార్చటం ఖాయం. దీన్ని అట్టడుగు వర్గాల ప్రజానీకం ఎంతవరకు సహిస్తారు? అనేది ఒక విషయం అయితే ఏదో ఒక పద్ధతిలో తిరగబడక తప్పని అసమాన స్థితిగతులను మరింత తీవ్రతరం చేసింది హరిత విప్లవం అనేది పచ్చినిజం. 1982 నుండి అక్కడి ప్రజానీకం చేస్తున్న పోరాటాలలో దీని పాత్ర ఎంత అనేది చర్చనీయాంశం కావచ్చుగాని హరిత విప్లవంవలన రైతాంగ జీవితాలతో ఏర్పడిన సంక్షోభ ప్రభావం తప్పనిసరిగా ఉంది అనేది అందరూ అంగీకరించి తీరవలసిన విషయం. పంజాబ్‌లో మతోన్మాదం పడగలెత్తి రక్తపాతాన్ని సృష్టిస్తున్నాయని అహోరాత్రాలూ ప్రచారంచేసిన రాజీవ్‌కి కాకపోయినా, 'పంజాబ్' ఇందిరాగాంధీ సృష్టి అని గోలచేసే ఇతర పార్టీలకుకూడా ఈవాస్తవం కనపడదు. కారణం వారి మధ్య గొడవ కేవలం ఎవరు అధికార పీఠాన్ని అధిష్టించాలని మాత్రమే కనుక.

భూలోక స్వర్గం పంజాబ్‌లో ఏదో ఏర్పడ్డట్లు, త్వరలో దేశమంతటా అలాంటి పంజాబ్‌లనే తయారుచేస్తామన్నట్లుగా ప్రగల్భాలు పలకటం మన

రాజకీయ నాయకులకు రివాజు. అసలు పంజాబ్‌లోనే పరిస్థితి పైవిధంగా ఉందంటే దేశం మొత్తంమీద ఇంకెంత హీనంగా, నికృష్టంగా ఉందో చెప్పాల్సిన అవసరం విజ్ఞులకి లేదు. కాకపోతే ప్రభుత్వం, పత్రికల ప్రచారాన్ని నమ్మే ప్రజానీకం ఉన్నారు కనుక వివరించటం తప్పదు. అది మన మాటల్లో కాకుండా ప్రభుత్వం వివిధ సందర్భాలలో నియమించిన కమిటీలు, పరిశోధక బృందాలు, నిపుణులు తప్పనిసరయి ప్రకటించిన రిపోర్టులను చూపిస్తే చాలు, హరిత విప్లవంలోని విప్లవం ఏమిటో అర్థం అవుతుంది.

రైతాంగంయొక్క సామాజిక స్థితిగతులపై నూతన వ్యవసాయ వ్యూహ ప్రభావంగురించి అధ్యయనం చేసిన అమెరికా వ్యవసాయార్థిక శాస్త్ర నిపుణుడు ఫ్రాన్సిస్ ఫ్రాంకెల్ నిర్ధారణలు ప్రభుత్వ ప్రచారంలోని అవాస్తవాన్ని మనకు కళ్ళకు కట్టినట్లుగా చూపిస్తాయి.

భారత రైతాంగంలో మెజారిటీగా ఉన్న పేద రైతులు (2-3 ఎకరాల వరకు కలిగి ఉన్నవారు) ఎరువులు, పురుగుమందులను కొద్దిపాటిగా వాడటం వలన దిగుబడి పెరిగినప్పటికీ తిరిగి భూమిని అభివృద్ధి చేయటానికి అవసరమయినంత ఉండదు. అంటే వారి పరిస్థితి ఎప్పటికీ అదే స్థితిలోనయినా ఉంటుంది లేదా మరింత దిగజారుతుంది. సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధం కలిగిన పంటలను పండించటమే హరిత విప్లవ ఉపదేశం కనుక వారి ఆర్థిక వ్యవస్థలో ఏమాత్రం సంక్షోభం వచ్చినా పేద రైతాంగం, ఉన్న కొద్దిపాటి భూమినికూడా అమ్ముకుని రెక్కలను నమ్ముకోవాల్సిందే. పొగాకు, ప్రత్తి రైతుల కష్టాలు, స్థితిగతులు ఈ వాతావరణానికి అద్దం పడతాయి.

కౌలుదారులుగా జీవనాన్ని గడుపుతూ అర్ధాకలితో గడిపే నిరుపేదల జీవితాల్లో హరిత విప్లవం నిప్పులు కురిపించింది. మార్కెట్ లాభం ప్రాతిపదికగా పండించే వ్యాపార పంటలను పండించటం మొదలుపెట్టటంవలన భూమి కౌలుధర అతి తక్కువ కాలంలోనే గరిష్ఠ స్థాయికి పెరుగుతుంది.

కర్నాటకలోని బళ్ళారి ప్రాంతంలో వ్యవసాయదారుల పరిస్థితిని గమనిస్తే ఈ విషయం మనకి సులభంగా అర్థం అవుతుంది. సాగునీటి పారుదల సౌకర్యం కలగటంవలన ఈమధ్యకాలంలోనే అక్కడ వ్యాపారస్థాయిలో ప్రత్తి పండించటం మొదలయింది. గుంటూరు, ప్రకాశం జిల్లాలలో ప్రత్తిని పండించటంలోని మెళకువలకు గడించిన రైతులు అక్కడికి వెళ్ళటంవలన

పోటీ పెరిగి క్రమంగా లీజు ధర రూ. 500 నుండి రూ. 4,000 వరకు పెరిగింది ఈ పరిస్థితులలో కౌలుదారుల పరిస్థితి ఎంత దుర్భరంగా తయారయి ఉంటుందో ఊహించుకోవచ్చు. అధిక లీజుధరను భరించలేక, ప్రత్తిపంటకు కావలసిన పెట్టుబడిని పెట్టలేక వారు శాశ్వతంగా వ్యవసాయ కూలీలుగా ఉండిపోవటమే మిగిలిన ప్రత్యామ్నాయం. అలాగే వరి పండించే ప్రాంతాలలో 75 నుండి 89 శాతం రైతుల ఆర్థిక పరిస్థితి సాపేక్షికంగా అధ్వాన్నమయింది.

నూటికి 70 కి పైగా రైతుల జీవితాలలో చీకటిని నింపుతున్న హరిత విప్లవం ఎవర్ని ఉద్ధరించటానికి? ఫ్రాన్సిస్ ఫ్రాంకెల్ ప్రకారం 10 ఎకరాలు లేదా అంతకంటే ఎక్కువ భూమి కలిగినవారు ధనిక రైతులు. వారే పాలకుల అభివృద్ధికి గీటురాళ్ళు, వాళ్ళ అభివృద్ధే దేశాభివృద్ధి. వేళ్ళమీద లెక్కింపదగినంత మంది భూస్వాములు సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకొని మరింతగా కోరలు పెంచుకుంటే దేశాభివృద్ధికి పునాది పడినట్లే! ఎవరు ఏమయితేనేం, కావలసింది ఆహారధాన్యాల ఉత్పత్తి పెరగటం. సబ్‌మెరైన్లో మరో అత్యాధునిక యుద్ధ విమానమో రష్యానుండి సంపాదించటానికి అవి అవసరం మరి! దానికోసం ఎన్ని ఆకలి చావులయితేనేం? ఎందరు ఆత్మాహుతి చేసుకుంటేనేం? పాలకులు పరిష్కరించాల్సిన సమస్యల్లో జనాభా సమస్యకూడా ఒకటికదా మరి!

హరిత విప్లవాన్ని రైతాంగంలోని బహుకొద్దిమంది మాత్రమే వినియోగించుకోగలగటానికి ప్రధాన కారణం గ్రామీణ ప్రాంతంలోని భూమిలో అత్యధిక భాగం వీరి చేతులలో ఉండటమే! జీవచ్ఛవాల్లాగా బ్రతుకులీడుస్తూ తమ సమస్యలకి చావే పరిష్కారం అని నమ్మే అశేష జనానీకంతటికీ ఫలితాలు అందాలంటే ఈ అసమానతలను రూపుమాపాలి. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అత్యధిక శాతం ప్రజల ఆకాంక్షలకు అవసరాలకు అనుగుణ్యంగా ఉపయోగించటానికి ఫ్యూడల్ నేపథ్యాన్ని నిర్మూలించటం అత్యవసరం. అసమ సంబంధాలను నిర్మూలించకుండా పాలకులు వల్లెవేసే 'ఉత్పత్తిని పెంచటం' సైతం అసాధ్యం. ఇక్కడ తేలాల్సిన విషయం అంతా ఒక్కటే - టెక్నాలజీ ముందా? భూసంస్కరణ ముందా? ఉత్పత్తిని పెంచాలంటే - ఉత్పత్తి సంబంధాలలో అవసరమయిన తగిన మార్పులు లేకుండా ఉత్పత్తి శక్తులను ప్రవేశపెట్టవచ్చా అనే విషయం.

బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలలో కేవలం జనాభాలో 10 శాతం మాత్రమే వ్యవసాయంలో వినియోగింపబడి ఉండగా,

మన దేశంలో నూటికి 70 శాతం మందికి భూమే ప్రధాన జీవనాధారం. అమెరికా తదితర దేశాలు స్వయంసమృద్ధిని సాధించటమే కాకుండా ఇతర దేశాలకు సైతం ఎగుమతి చేయగలుగుతున్నాయి. దానికి కారణం ఆయా దేశాలలో అభివృద్ధిచెందుతున్న పరిశ్రమల అధిపతులు రైతులను కదిలించి పోరాడటంతో పాటుగా ఫ్యూడల్ భావజాలానికి వ్యతిరేకంగా పోరాడటమే. ఫలితంగానే భూస్వామ్యాన్ని, ఫ్యూడల్ దాస్యాన్ని అంతంచేసి నూతన వ్యవసాయ మార్పులకు, యాంత్రికీకరణకు రంగం సిద్ధంచేయగలిగింది.

వర్ధమాన దేశాలలో ప్రవేశపెట్టబడుతున్న నూతన వ్యవసాయ పద్ధతులపై వ్యాఖ్యానిస్తూ ఐక్యరాజ్య సమితి మాజీ జనరల్ సెక్రెటరీ యూథాంట్ ఇలా అన్నారు — "వ్యవస్థాగత మార్పులను ప్రవేశపెట్టకపోతే, ప్రస్తుతం నెలకొని ఉన్న అసమానతల నేపథ్యంలో హరిత విప్లవం జీవనాధార వ్యవసాయదారుల (subsistence farmers) కంటే ఇప్పటికీ పెట్టుబడిదారీ పద్ధతులలో వ్యవసాయంచేసే ధనిక రైతులకు అందులోనూ భూస్వాములకు అత్యధికంగా లాభించగలదన్న పరిశీలకుల అభిప్రాయం వాస్తవమే. కనుక ఇప్పటికైనా భూసంస్కరణలను యుద్ధ ప్రాతిపదికపై అమలుచేసి, సాపేక్ష సమానతలను సాధించవలసిన అవసరం ఉన్నది."

ఇలాంటి మార్పులేవీ లేకుండా హరిత విప్లవం సాధ్యంకాదని మన పాలకులకు తెలియదా? వ్యవస్థాగత మార్పులను అమలుచేయకుండా వ్యవసాయరంగాన్ని అభివృద్ధి చేయలేమనే విషయాన్ని మన పాలకులు గుర్తించలేదా? నిజానికి మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయం గురించి వివరించే సందర్భంలోనే ప్లానింగ్ కమీషన్ "భూసంస్కరణలు, నీటిపారుదలాభివృద్ధి - ఇవి రెండూ వ్యవసాయాభివృద్ధికి అత్యవసరం అని పేర్కొంది. వేలాది ఎకరాలకు సొంతదార్లయిన కాంగ్రెస్ మంత్రుల హయాంలో భూములు పంచాలంటూ ఏర్పరచిన లక్ష్యాలు కేవలం కాయితాలకే పరిమితం అయ్యాయి. ఈ దిశలో చేసిన ప్రయత్నం అంతా జనాల కన్నీళ్ళు తుడపటానికే పరిమితం అవటంతో భూసంస్కరణలు తీవ్రంగా విఫలం అయ్యాయి. కుక్క, పిల్లి వంటి పెంపుడు జంతువుల పేర్లమీద ఉంచీ, రకరకాల తప్పుడు పద్ధతులకు పాల్పడి, ఇవేవీ కాకపోతే కోర్టులను వాడుకొని భూస్వాములంతా తప్పుకున్నారు ఇలాంటివారినుండి అదనపు భూమిని రాబట్టటానికి తీవ్రమయిన చర్యలు తీసుకోవలసిన సమయంలో పాలకవర్గాలకు తోకలాంటి ప్లానింగ్ కమీషన్ కొత్త రాగం మొదలెట్టింది. 1960 లలో దీనికి మెరుగులు దిద్ది జనంమీదికి వదిలింది.

దీన్నిబట్టి చూస్తే హరిత విప్లవం అసలు లక్ష్యం సంస్థాగత మార్పులను భూసంస్కరణలను పక్కదారి పట్టించటమే! భూసంస్కరణలను అమలు చేయకుండానే, భూసంబంధాలలోని అసమానతలను తొలగించకుండానే పేద రైతులనూ, కూలీలను - మొత్తంగా రైతాంగాన్ని ఉద్ధరిస్తామని మాయమాటలు చెప్పటానికి కాంగ్రెసు ప్రభుత్వం తెలివిగా ఉపయోగించుకున్న ఆకర్షణీయమైన వినాదమే హరితవిప్లవం. కాగా 1980 నుండి ఈనాటి వరకు ఎరువులకు సబ్సిడీలని, విత్తనాలకు సబ్సిడీలనీ మాయమాటలు చెప్తూ కాలయాపన చేయటానికి ప్రయత్నిస్తున్నది భారత ప్రభుత్వం రైతాంగపోరాటాలు విజృంభించి భూమి సమస్యను మేమే పరిష్కరించుకొంటామని రైతాంగం ముందుకు వచ్చిన ప్రతిసారీ భూసంస్కరణల మంత్రం పఠించటం మాత్రం తప్పటం లేదు. అందుకే ఎప్పటినుండో బూజుపట్టిన భూసంస్కరణల మంత్రానికి ఇందిరమ్మ 1971 లో మళ్ళీ ప్రాణంపోయగా, ఆమధ్య ఎన్.టి. రామారావు తెలుగు మాగాణి సమారాధన అని పదివేల ఎకరాలు పంచుతానని హడావుడి చేశాడు.

నాయకుల దృష్టిలో భూసంస్కరణలు అంటే అక్కడక్కడ పనికీ రాకుండా పడిఉన్న భూముల్నీ, భూస్వాముల వద్ద ఉన్న మిగులు భూముల్లో కొద్దిపాటి భూమినీ సేకరించి పంచటమే. నిజానికి ఇలాంటి భూసంస్కరణలు అమలయినంత మాత్రాన మన సమాజంలో ఉత్పత్తి అభివృద్ధి చెందటం అన్న ప్రశ్నేలేదు. ఎందుకంటే ఈనాడు రాక్షసంగా అమలవుతున్న ఫ్యూడల్ దోపిడీ పద్ధతుల నిర్మూలనకు ఇవి ఏవిధంగానూ తోడ్పడవు.

భూసంస్కరణలు అమలుచేయనిదే ఆధునిక వ్యవసాయ పద్ధతులను అమలుచేయటం సాధ్యంకాదని చెప్తున్నామంటే కేవలం భూసంస్కరణలే మన సమాజంలోని ఉత్పత్తి సంబంధాలను సూచిస్తున్నాయని కాదు. అర్ధవలస-అర్ధ భూస్వామ్య దేశమయిన మన దేశంలో అసమాన భూమి సంబంధాలతోపాటే సాంఘిక దోపిడీ కూడా విచ్చలవిడిగా సాగుతుంది. సాంఘిక వ్యవస్థలోని కొన్ని కులాలు కేవలం గ్రామికులుగా తప్ప రైతులుగా ఉండరాదనే నీచమయిన సిద్ధాంతం కొంతకాలం రాజ్యమేలింది. ఈనాడు పరిస్థితి కొంచెం మారినా, మొత్తంగా అలాగే ఉంది అంతేకాకుండా వెట్టిచాకిరీ చేయించుకోవటం, పేద రైతాంగం అవసరాలను అవకాశంగా చేసుకుని వడ్డీవ్యాపారం చేయటం, వారి స్త్రీలను లైంగికంగా దోపిడీ చేయటం లాంటి ఎన్నో దోపిడీ పద్ధతులు అమలులో ఉన్నాయి. ఈ అన్యాయాలకు వ్యతిరేకంగానూ, భూమి కావాలనీ ఉద్యమించిన రైతాంగాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేస్తుంది, దోపిడీదారుల ముద్దుబిడ్డ అయిన

భారత ప్రభుత్వం. తెలంగాణా రైతాంగ పోరాటం నుండి నేటి కరీంనగర్, ఆదిలాబాద్, దండకారణ్య రైతాంగ పోరాటాలపై అమలవుతున్న నిర్బంధం ఇదే వాస్తవాన్ని తెలియచేస్తుంది.

ఉత్పత్తిని పెంచటమే తమ లక్ష్యం అని నిరంతరం ప్రకటించే పాలక వర్గాలకు నిజంగా అందుకు పాటుపడటం అంటే సుతరామూ గిట్టదు. అందుకే ఈ నాటకం అంతా. అయినప్పటికీ కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావం వలనకానీ, మరో దారిలేక ప్రతిఘటించటం వలన కానీ ఫ్యూడల్ దోపిడి పద్ధతులు కొంత వరకు నిర్మూలింపబడ్డాయి. వందలాది, వేలాది ఎకరాల భూస్వాముల స్థానంలో ధనిక రైతులు వచ్చారు. వెట్టిచాకిరీ చేయించుకుంటూ, వారి అదనపు శ్రమను పూర్తిగా దోపిడీ చేసి పంటలు పండించే స్థానంలో వారికి కూడా ఎంతో కొంత ముట్టచెప్పే పరిస్థితి వచ్చింది. కూలీరేట్లు పెరగడం వంటి వాటిలో మనం దీనిని చూడవచ్చు. ఆసామి కొబట్టి పని చేయాలనే పరిస్థితి పోయి కూలికి పని చేయమనే పరిస్థితి వచ్చింది. ఇది న్యాయమేనా అంటే ఏమాత్రమూ కాదు. కాని సాపేక్షికంగా మెరుగయిన స్థితి. కోస్తా ఆంధ్ర ప్రాంతం ముఖ్యంగా కృష్ణా, గుంటూరు, తూర్పు, పశ్చిమ గోదావరి, ప్రకాశం జిల్లాలో కొన్ని భాగాలు- దీనికి మంచి ఉదాహరణ. ఇలాంటి ప్రాంతాలలోనే హరితవిప్లవం కొన్ని ప్రాంతాలలోనే అయినా విజయవంతం అయింది.

సామాజిక సూత్రాలు పాలకుల చేతులలోనివి కాదు కాబట్టి వారి ఆర్భాటాలు, హడావుడి వాగ్దానాలు, వీటితో సంబంధం లేకుండా హరితవిప్లవం కేవలం కొన్ని ప్రాంతాలలో మాత్రమే (ప్రభుత్వ లెక్కల ప్రకారం) పరిమితంగా నయినా విజయవంతం అయింది. అదికూడా సాపేక్షికంగా ఫ్యూడల్ వ్యవసాయ సంబంధాలు దెబ్బతిన్న పంజాబ్, హర్యానా, పశ్చిమ ఉత్తరప్రదేశ్ మరియు ఆంధ్రప్రదేశ్‌లలో మాత్రమే హరితవిప్లవం విజయవంతం కావటం ఇందుకు నిదర్శనమని ప్రముఖ వ్యవసాయార్థిక శాస్త్ర నిపుణుడు సి.హెచ్. హనుమంతరావు పేర్కొన్నారు. దీనికి భిన్నంగా అంటే భూసామ్య పద్ధతి బలంగా ఉన్న ప్రాంతాలలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అమలుచేస్తే అసమానతలు అదే నిష్పత్తిలో పెరిగి, తీవ్రమయిన ఘర్షణల మూలంగా ఉద్రిక్తతలు చోటుచేసుకోవటం అనివార్యం. ఈ పరిస్థితి తమిళనాడులోని తంజావూరు జిల్లాలో కళ్ళకు కట్టినట్లు కనపడుతుంది. అక్కడి భూస్వాములు ఆంధ్రరాష్ట్రం నుండి కూలీలను కారు చౌకగా తెచ్చుకొని ఫ్యూడల్ సౌకర్యాలు చెక్కుచెదరకుండా ఉత్పత్తిని

పెంచాలని చేసే ప్రయత్నంలో వర్గసంఘర్షణలు మరింత తీవ్రతరం అయ్యాయే తప్ప ఉత్పత్తి పెరగలేదు.

పెరుగుతున్న జనాభాకు సరిపడినంతగా ఆహారధాన్యాలను పండించి, విదేశాలపై ఆధారపడే వికృష్ట స్థితిని నివారించాలంటే ఉత్పత్తిశక్తులలో అభివృద్ధి ప్రవేశపెట్టబడాలి. వ్యవసాయ పనిముట్లనుండి, చీడపీడల నివారణోపాయాల వరకూ ప్రతి విషయంలోనూ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవాలి. వ్యవసాయరంగంలో దేశం అభివృద్ధిచెందటానికి ఇది కీలకమయిన మొదటి విషయం. ఇందులో విజయవంతం కానిదే ఏ మార్పూ ఫలప్రదం కాదు. విజానికి శాస్త్రవేత్తలు చేసిన నిరంతర కృషి వలన వ్యవసాయ ఉత్పత్తి సాధనాలు, పద్ధతులు 20వ శతాబ్దంలో వేగంగా అభివృద్ధిచెందాయి. వీటిని మనదేశంలో ప్రవేశపెట్టటమే తక్షణ కర్తవ్యం. అయితే అభివృద్ధి క్రమంలో ఉత్పత్తి శక్తులు, సంబంధాల మధ్య సమన్వయం సాధించటం అవసరం. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఆటంకంగా నిలిచినవి నేటి భూసంబంధాలు. ఉత్పత్తి శక్తులంటే ఉత్పత్తి సాధనాలు, రైతులు, నూటికి 40 మందిగా ఉన్న బడారైతుల చేతులలోనే భూమి అంతా కేంద్రీకరించినపుడు మిగతా ప్రజానీకం అంతా ప్రేక్షక పాత్రను మాత్రమే వహిస్తుంది. కౌలుకు తీసుకునో, శ్రమ శక్తిని అమ్ముకోవటం వలననో వీరు కూడా ఈ అభివృద్ధి క్రమంలో పాలుపంచుకున్నప్పటికీ, హృదయపూర్వకంగా సర్వశక్తుల్నీ వెచ్చించటం జరుగదు. కారణం అది వారి ప్రయోజనాలకు భిన్నంగానూ, ధనిక, బడా రైతులకు అనుకూలంగానూ ఉండటమే! దున్నేవాడిదే భూమి ప్రాతిపదికగా భూమినంతటినీ పంచి అన్ని రకాల ఫ్యూడల్ ప్రభుత్వాన్ని నిర్మూలించి మెజారిటీ ప్రజల హక్కుల్ని పరిరక్షించే నూతన ప్రజాస్వామిక ప్రభుత్వంలో మాత్రమే వారి సృజనాత్మక శక్తులు వికసించగలవు. ఉత్పత్తి శక్తులు వేగంగా అభివృద్ధిచెంది ఉత్పత్తి పెరగగలదు. చైనా అనుభవం ప్రపంచానికి చాటి చెప్పింది ఇదే.

అంతవరకు ఫ్యూడల్ దోపిడీని కాపాడటానికి కంకణం కట్టుకున్న ప్రభుత్వం చెప్పే హరిత విప్లవం రైతాంగాన్ని, మేధావులను కొంతకాలం అయినా మోసగించటానికి పనికిపస్తుందిగాని ఆచరణ సాధ్యం కాదు. కనుక రైతాంగం తమ భవిష్యత్తును నిర్మించుకోవాలంటే దారిపొడుగునా అశేష త్యాగాలు చేస్తూ, ఫ్యూడలిజం నిర్మూలనకు ఎత్తిన తుపాకీ దించకుండా పోరాడుతున్న ఉత్తర తెలంగాణా దండకారణ్య బీహారు రైతాంగాల బాటలో పయనించాలి. ఉద్యమ విజయంలోనే తమ జీవితం ఆధారపడి ఉందని గమనించాలి. నూతన ప్రజాస్వామిక సమాజ స్థాపన కోసం చివరి రక్తపుబొట్టు వరకు పోరాడాలి.

కథ :

# ప్రతీకారం

## —రేపల్లె సాంబశివరావు

అది ఒక బీడు. ఆ బీడులో ఒక పాముపుట్ట, ఒక చీమలపుట్ట ఉన్నాయి. చీమలు ఆకలితీర్చుకోవడానికి ఆ చుట్టుప్రక్కల ప్రాంతం అంతా తిరుగుతుండేవి. పాము తన ఆకలితీర్చుకోవడానికి ఆ ప్రాంతమంతా తిరిగి దొరికిన కప్పలను, ఎలుకలను ఇతర పురుగులను తింటూఉండేది.

ఒకరోజు పాము తనకు దొరికిన ఎలుకను నోటపట్టుకొని హుషారుగా పుట్టకు తిరిగి వస్తుండగా దాని శరీరం తగిలి కొన్ని చీమలు నలిగి చనిపోయాయి. చనిపోయిన చీమలను చూసిన మిగతా చీమలు పామును నిలదీసి ఏమిటీదౌర్జన్యం అని అడగడానికి నిశ్చయించుకొన్నాయి. మరుసటిరోజు పాము పుట్టనుంచి బయటకురాగానే చీమలన్నీ పాముచుట్టూ గుమిగూడి తమ మిత్రులకు జరిగిన ఆపద గురించి మాట్లాడడం ప్రారంభించాయి. చీమల మాటను చెవిన వేసుకోకుండా దులబరించుకుంటూ జరజరా వెళ్ళిపోయింది పాము. ఈవిధంగా పాముకూ చీమలకూ మధ్య వైరుధ్యం పెరుగుతూ వచ్చింది.

పాము చీమల బెడద ఎలా వదిలించుకోవాలా అని ఆలోచించసాగింది. ఇంతలో పాముకు ఒక ఆలోచన వచ్చింది. చీమలతో స్నేహం చేస్తే తన సమస్య పరిష్కారం అవుతుందని అనుకుంది. కాని చీమలకు లొంగటం తన ప్రతిష్టకు భంగకరం అని భావించింది

ఈ సమస్యకు పరిష్కారం ఎలా అని ఆలోచించసాగింది పాము. పాముకు ఒక ఆలోచన వచ్చింది. ఒక్కసారి నా శరీరం తగిలి పది చీమలు చచ్చాయి గదా, రోజూ ఈవిధంగా పది చీమల్ని చంపితే పదిరోజులలో చీమలబెడద వదిలించుకోవచ్చు అనుకుంది పాము. మరుసటిరోజు పుట్టనుంచి బయలుదేరుతూ పాము చీమలమీదగా స్పీడుగా దూసుకుపోవడం ప్రారంభించింది. పాము శరీరం తగిలి కొన్ని చీమలు చచ్చిపోగా మరికొన్ని నొప్పులతో బాధపడసాగాయి. మిగిలిన చీమలు నలిగిన చీమలచుట్టూ చేరి ఆ దెబ్బలు తగిలిన చీమలను తమ పుట్టకు తీసికొనిపోయాయి.

చీమలన్నీ తమ మిత్రులకు జరిగిన అన్యాయాన్ని గురించి బాధపడుతూ ఆ బాధలోనుంచి ఒక నిర్ణయానికి వచ్చాయి. చీమలన్నీ ఒకచోటికి చేరాయి.

ఆ సమావేశంలో అన్నీ చీమలు పాల్గొన్నాయి. చీమల నాయకుడు చీమలను ఉద్దేశించి మాట్లాడడం ప్రారంభించాడు. ప్రతిఒక్కరూ తమ మనసులోని ఉద్దేశాన్ని బయటకు చెప్పాలి. పామును గురించి మీ అభిప్రాయమేమిటో స్పష్టంగా చెప్పండి అని మిగతా చీమలను ప్రశ్నించాడు. చీమలన్నీ ఒకేసారి ఒకే గొంతుతో పామునుచంపి మన మిత్రులకు ఆత్మశాంతి కలిగించాలి అన్నవి పామును చంపడానికి మిగతా చీమలన్నీ సిద్ధమయ్యాయి. పుట్టనుంచి బయలు దేరి పాము పుట్టదగ్గర కాపువేసి కూర్చున్నాయి. పాము తన ఆకలి తీర్చుకో డానికి ఎప్పటిలాగే పుట్టనుంచి బయటకు రావటాన్ని గ్రహించాయి చీమలు. చీమలన్నీ ఒక్కసారి పామును చంపటానికి పరుగులు తీయటం ప్రారంభిం చాయి. ఎదురుగా తనమీదకు పరుగులుతీస్తున్న చీమలను చూచి ఏమిచేయాలో అర్థంకాక ప్రాణభయంతో పరుగులు తీసుకుంటూ పుట్టలో జొరబడింది పాము. పారిపోతున్న పామును చూచి చీమలు కేకలువేస్తూ ఇంకా వేగంగా పరుగును ప్రారంభించి పాముపుట్ట చేరుకున్నాయి. చీమలు తన పుట్టను చేరాయని గ్రహించిన పాము ఏమి చేయాలా అని పరిపరివిధాలా ఆలోచించసాగింది. కొన్ని రోజులు గడిచిన తరువాత పాముకు ఒక ఆలోచన వచ్చింది. తనను చీమలబారినుంచి కాపాడటానికి కప్ప గుర్తుకొచ్చింది. కాని కప్పను కలును కొని తన సమస్యను చెప్పటానికి వీలుకాలేదు. ఒకవైపునుంచి ఆకలిబాధ. బయటకు వెళ్ళటానికి వీలులేదు అలాంటి పరిస్థితులలో ఈ సమస్యను కప్పకు చెప్పడం ఎలా అని ఆలోచించసాగింది పాము.

సమయం మధ్యాహ్నం పన్నెండు గంటలు కావస్తోంది. ఆకాశం అంతా మబ్బులతో కమ్ముకుపోయింది. ఆకాశంలోంచి తీగ మెరుపులు కన్పిస్తున్నాయి. ఆకాశం దద్దరిల్లేలా ఉరుములు ఉరుముతున్నాయి. పంట పొలాల మీదుగా చల్లటిగాలి వీస్తోంది. వాతావరణం మార్పులోనుంచి ఒక్కొక్క చినుకూ పడటం ప్రారంభించాయి.

వర్షాన్ని చూసిన పాముకు ఒక ఆలోచన వచ్చింది. ఈ వర్షంలోనే కప్పలను కలుసుకోవాలి అనుకుంది. చీమలు వర్షంవలన బయటకు రాలేక పోయాయి. పాము వర్షంలో కప్పలదగ్గరకు బయలుదేరింది కప్పలు వర్షం పడటం చూసి సంతోషంతో కేకలు వేస్తున్నాయి. కప్పలు పాము రావడాన్ని చూసి అరుపులు ఆపేశాయి. అంతా నిశ్శబ్దంగా ఉంది. పాము కప్పల దగ్గరకు చేరుకుంది. కప్పలు భయంతో గంతులువేస్తూ తమతమ నివాసాలకు వెళ్ళ

సాగాయి. పాము "ఆగండి, నా మాట వినండి, నేనేమీ చేయను, నా మాట నమ్మండి" అంటూ బ్రతిమాలసాగింది. పాము మాటలు నమ్మలేక అవి గంతులు వేస్తూనే ఉన్నాయి.

పాము ఒక ముసలి కప్పను చేరుకుని నువ్వయినా నా మాట నమ్ము. నేను మిమ్మల్ని చంపటానికి రాలేదు. నా బాధను అర్థంచేసుకొని నాకు ప్రాణ భిక్ష పెట్టండి అని బతిమలాడింది. అందుకు ముసలికప్ప నిన్ను మావాళ్ళు నమ్మలేక పారిపోతున్నారు. నేను వాళ్ళతో మాట్లాడి ఏ సంగతి చెబుతాను. నువ్వా పొదలో ఉండు అంది. పాము ఆ పొదలో ఉండటానికి సరేనని తల వూపింది. ముసలికప్ప మిగతా కప్పలను చేరుకొని పామును గురించి చెప్పింది అందుకు కప్పలు అంగీకరించలేదు. అప్పుడు ముసలి కప్ప "అవసరాలు అందరికీ ఉంటాయి. పాముకు మనతోటి అవసరం వచ్చిందని మనం ఇలా అంటే రేపు పాముతోటి మనకూ అవసరం రావచ్చు. అప్పుడు పామూ ఈ విధంగానే అంటుంది. ఎట్లా అయినా పాము మనకన్నా బలమైంది. ఈరోజు మనం పాముకు సహాయపడితే ఏదో ఒకరోజు పాము మనకు సహాయపడుతుంది మీరు ఆలోచించి మీమీ అభిప్రాయాలను చెప్పండి" అంది. అందుకు కొన్ని కప్పలు సరేనని తలలూపాయి. మొత్తంమీద పాముకు సహాయపడాలన్న ఉద్దేశం ఎక్కువ కప్పలలో ఉండటంవలన మిగతా కప్పలుకూడా అందుకు ఇష్టపడ్డాయి.

ముసలి కప్ప మిగతా కప్పలను తీసుకొని పాముదగ్గరకు వెళ్ళింది. పాము కప్పలు రావడాన్ని చూసి సంతోషంతో పొదనుంచి బయటకొచ్చి కప్ప లకు ఎదురుగా పోయింది ఏవిధంగా నీకు మేము సహాయపడాలి అని కప్పలు పామును అడిగాయి. అందుకు పాము చీమలపిల్ల తినకొచ్చిన ఇబ్బందిని గురించి చెప్పింది. అందుకు మీరందరు చీమల పుట్ట చుట్టూచేరి చీమలను చంపి తినండి. వాన తగ్గుతున్నది. వాన వెలిసేలోగా నేను పుట్టలోకి పోకపోతే నా ప్రాణానికే ప్రమాదం. నేను వెళుతున్నాను. మీరు ఎప్పుడు వస్తారు? అంది పాము. కప్పలు రేపు ఉదయాన్నే వస్తామన్నాయి.

మరుసటిరోజు తెల్లవారకముందే కప్పలు చీమల పుట్టచుట్టూ చేరాయి. చీమలు ఎప్పటిలాగే పుట్టనుంచి బయటకు రావడం ప్రారంభించాయి. కప్పలు వచ్చిన చీమలను వచ్చినట్టు తినడం ప్రారంభించాయి. ఈవిధంగా కొన్ని గంటలు గడిచాయి. బయటకు వెళ్ళిన చీమలు లోనికి రావటంలేదు. లోపల

ఉన్న చీమలకు పరిస్థితి అర్థంకాలేదు. అవి తీవ్రంగా ఆలోచించసాగాయి ఒక చీమ నేను వెళ్ళి చూసి వస్తానని బయలుదేరింది. పుట్టలో అంచున ఉండి బయటకు పారచూసింది.

చీమకు గుండె పగిలినంత పనైంది తన పుట్టచుట్టూ ఉన్న కప్పలను చూచి పరుగులుతీస్తూ లోనఉన్న చీమలను చేరుకుంది. తను చూసినదంతా మిగతా చీమలకు చెప్పింది. చీమలు ఏమిచేయాలో అర్థంగాక కుప్పకూలి పోయాయి. కప్పల వల్ల చీమలబెడద వదిలిందని అర్థం అయింది పాముకు. పుట్టనుంచి బయటకువస్తూ కప్పలను చూసి కప్పలను తిని చానాళ్ళు అయింది అనుకుంది పాము. తనకు దగ్గరలో ఉన్న ఓ కప్పను నోటపట్టుకొని మిగతా కప్పలకు అర్థంకాకుండా జరజరా వెళ్ళిపోయింది. ఈవిధంగా తనకు ఆకలి వేసినప్పుడల్లా కప్పలను తినడం ప్రారంభించింది పాము కప్పను నోటపట్టు కొని పోతూఉండగా కొంచెం దూరంలో ఆహారం కోసం తిరుగుతున్న ఎలుక చూసింది. పాము వెళ్ళిన కొంచెంసేపటికి కప్పల దగ్గరకు వచ్చింది ఎలుక.

ఎలుక రావడాన్ని చూసిన కప్పలు ఏవిటి ఎలుకబావా ఇట్టా దయచేశావు అన్నాయి. ఏమీలేదు కప్ప బావలందరూ ఇక్కడకు ఎందుకు వచ్చినట్లో తెలుసు కుందామని అని సమాధానమిచ్చింది. కప్పలు తాము ఎందుకు వచ్చింది వివరించి చెప్పాయి అమాయకులారా! నమ్మినోడిని నట్టేట్లోముంచే రకం పాము. దాని మాటలు నమ్మి చీమలను చంపటానికి మీరొస్తే మిమ్మల్ని చంపి తన ఆకలి తీర్చుకొంటుంది పాము అని ఎలుక పాము కుట్ర స్వభావాన్ని వివరించింది.

బయట గొడవను విన్న పుట్టలోని చీమలు పుట్ట అంచుకు వచ్చి జరిగే దంతా చూస్తూ వింటూ ఉన్నాయి.

ఎలుక మాటలు విన్న కప్పలు ఆశ్చర్యపోయాయి. కప్పలన్నీ ఒక్క సారి ఇది నిజమా అని ఎలుక వంక ఆశ్చర్యంగా చూశాయి. నా కళ్ళారా చూసాను కనుక చెబుతున్నాను, కావాలంటే మీకళ్ళతో మీరే చూడండి అంది ఎలుక. అందుకు కప్పలన్నీ సరే అన్నట్లు తలలు ఆడించాయి. పాము రాక కోసం నిశ్శబ్దంగా ఎదురుచూస్తున్నాయి.

కొంచెంసేపు గడిచాక పాము పుట్టలోనుంచి బయటకువస్తూ తనకు దగ్గరలో ఉన్న ఓ కప్పను పట్టుకోబోయింది. వెంటనే కప్పలన్నీ పెద్దకేకలు వేస్తూ పాముమీదకు ఉరికాయి. కప్పల కేకలు విన్న చీమలు, ఎలుకలూ తమ

వ్యాసం :

# కమ్యూనిజంలేని కమ్యూనిస్టులు

—కోబడ్‌గాంధీ

గత కొద్ది నెలలుగా పెట్టుబడిదారీ ప్రసారసాధనాలు తూర్పుయూరప్ దేశాల పరిణామాలపై కమ్యూనిజానికి కాలంచెల్లిందని బహుళ ప్రచారం చేస్తున్నాయి. అయితే వాటి ప్రచారాల్లో అస్పష్టత, గందరగోళం, వైరుధ్యాలనూ మనం గమనించవచ్చు. ఆరు మాసాల క్రితం వరకు పశ్చిమదేశాలన్నీ రుమేనియా అధినేత చెసెస్కూను గొప్ప సంస్కర్తగా కీర్తించాయి. ఆ దేశాధినేతలే నేడు చెసెస్కూను క్రూర రాక్షసునిగా నిందిస్తున్నాయి. అదే విధంగా 'బెర్లిన్ గోడ'ను స్టాలిన్ నియంతృత్వానికి ప్రతీకగా అభివర్ణించాయి. నేడు ఆ గోడ బద్దలవడం 'స్టాలినిజం' మరణంతో పోల్చాయి. కాని బెర్లిన్ గోడ నిర్మాణం స్టాలిన్ కాలంలో కాదని, రివిజనిస్టు కృశ్చేవ్ కాలంలో 1961 లో

---

పుట్టలనుంచి బయటకు వచ్చి కప్పలతో కలిసి విజృంభించాయి. కప్పలను, చీమలను, ఎలుకలను చూసిన పాము స్పీడుగా పుట్టలోనికి జారుకుపోయింది.

పాముకోసం ఎదురుచూస్తున్నాయి చీమలు, కప్పలు, ఎలుకలు. మనం దరం ఇక్కడ ఉంటే పాము రాదు కనుక పాముకు కనబడకుండా మనం దాక్కోవాలి అని ఒక ఎలుక అన్నది. అంతే చీమలన్నీ దగ్గరలో ఉన్న గడ్డి పొదలోకి పోయాయి. కప్పలు కొంచెం దూరంలో ఉన్న నీళ్ళగుంటలోకి పోయాయి. ఎలుకలు ఇంకొంచెం దూరంలో ఉన్న ముళ్ళపొదలోకి పోయాయి.

కొంచెంసేపు గడిచాక పాము పుట్టనుంచి మెల్లగా బయటకు వచ్చింది. అంతా నిశ్శబ్దంగా ఉంది. పాము పుట్ట వదలి కొంచెం దూరం వచ్చిన తరువాత చీమలు పాముపుట్టను ఆక్రమించాయి. కప్పలు పాముకు ఎదురుగా వచ్చాయి. ఎలుకలు కప్పలను సమీపించాయి. ఇది అంతా చూసిన పాము వెంటనే తిరిగి పుట్ట దగ్గరకు పోవడానికి పరుగులుతీసింది.

కానీ పుట్టను చుట్టుముట్టిన చీమలను చూసి ఏమి చేయాలో అర్థంగాక పాము అటూ ఇటూ చూస్తుండగా కప్పలు, ఎలుకలు పామును సమీపించాయి. అటువైపు కప్పలు ఇటువైపు ఎలుకలు ఒక్కసారిగా పామును చుట్టుముట్టాయి. చీమలు, కప్పలు, ఎలుకలు పాముమీదపడి పామును కసిగా చంపివేశాయి.

జరిగిందనే విషయాన్ని మాత్రం దాచాయి. ఇక రుమేనియా ప్రజల కష్టాలకు, కడగండ్లకు కారణం 'కమ్యూనిజమే'నే గోబెల్స్ ప్రచారంచేస్తున్నాయి. అయితే అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ నుండి రుమేనియా తీసుకున్న 1,300 కోట్ల పౌండ్ల రుణాన్ని అతి తక్కువ వ్యవధిలో చెల్లించవలసి రావడం వల్లనే రుమేనియా ప్రజలు తిండికి-బట్టకు నోచుకోలేకపోయారనే వాస్తవాన్ని నొక్కిపెట్టారు.

అర్ధసత్యాలను, అసత్యాలను, ప్రచారం చేస్తూ, వాస్తవాలను ప్రక్కకు రిస్తూ పెట్టుబడిదారీ వర్గాలు కమ్యూనిజానికి కాలం చెల్లిందని సంబరపడిపోతున్నారు. అయితే ఈ అవాస్తవ ప్రచారం గుర్తింపుకు వచ్చిందంటే దానికి కారణం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఒక భాగం (రివిజనిస్టులు) యింతవరకు తూర్పుయూరోపు దేశాల, రష్యా యొక్క పాలకవర్గాన్ని గురించి ప్రపంచ కార్మికవర్గంలో, పీడిత ప్రజల్లో కల్పించిన భ్రమలే. ఆ దేశాలు భూతల స్వర్గాలనీ, ఆ పాలకవర్గాలు కమ్యూనిస్టులనీ రివిజనిస్టులు విపరీతంగా ప్రచారం చేశారు. ఇప్పుడు ఆ దేశాల పాలకులు విపరీతంగా సంపదను ఆర్జించి, భోగలాలసులై బ్రతికారనే నగ్నసత్యం బయటపడింది. దానితో ఇంతవరకు వారిని కమ్యూనిస్టులుగా భ్రమించడంవల్ల 'కమ్యూనిజం' నేడు నిందలకు గురికావలసి వచ్చింది. రుమేనియా అధినేత చెషెస్కూ రాజీవ్ గాంధీలాగా భోగలాలస జీవితాన్ని గడిపాడనే విషయాన్ని అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకులు ఎందుకు దాచారు? అదేవిధంగా బల్గేరియాను 35 ఏళ్ళుగా పాలించిన జివ్‌కో (zhivko) అక్రమార్జనతో కేవలం తన కుటుంబం కొరకే 30 ఆధునాతన రాజప్రసాదాలు కలిగివున్నాడనే వాస్తవాన్ని ప్రపంచ ప్రజల్నుండి ఎందుకు దాచారు? ఆ దేశాల్లో పాలన సాగించేది కమ్యూనిజమా? ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానమా? కమ్యూనిస్టు రాజ్యాలుగా ప్రచారమైన రష్యా, ఇతర తూర్పు యూరపు దేశాల్లో ప్రజలు నిత్యావసర వస్తువుల కొరతతో సతమతమవుతుంటే పార్టీ, ప్రభుత్వాధినేతలు సకల సంపదలనెలా సమకూర్చుకున్నారు? స్వర్లోక సుఖాల నెలా అనుభవించారు? దీనికంతా కారణం 1956 తర్వాత ఆ దేశాల పాలకవర్గంయొక్క వర్గదృక్పథాన్ని పట్టించుకోకపోవడమే. అవి ఇంకా కమ్యూనిస్టు వ్యవస్థలుగానే నిలిచాయనే అసత్యప్రచారం చేయడమే. దాంతో నేడు ఆ 'కమ్యూనిస్టు' అధినేతల అరాచకాలు బయటపడేసరికి పెట్టుబడిదారివర్గానికి 'సోషలిస్టు వ్యవస్థ' సంక్షోభంలో చిక్కుకుందని, కమ్యూనిజానికి కాలంచెల్లిందని ప్రచారంచేయడానికి అవకాశం దొరికింది.

1958 తర్వాత రష్యా తదితర తూర్పు యూరపు దేశాలన్నీ వాస్తవంలో పెట్టుబడిదారీ దేశాలేగాని సామ్యవాద దేశాలుకాదు. నేటి నిజ పరిస్థితేమిటంటే ఆ దేశాల్లో ప్రభుత్వ పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభంలో చిక్కుకుంది. ఈ సంక్షోభంనుండి బయటపడి పెట్టుబడిదారీశక్తులు స్వేచ్ఛగా అభివృద్ధిచెందడానికి 'పెరిస్త్రోయికా'లాంటి సంస్కరణలు నేడు అవసరమయ్యాయి. నిత్యావసర వస్తువుల కొరత, పార్టీ బ్యూరాక్రసీయొక్క నియంతృత్వ పాలన, స్వేచ్ఛ లేని జీవితం - ఇవన్నీ ఆ దేశాల్లో ప్రజల తిరుగుబాట్లకు కారణాలయ్యాయి.

రష్యాలో అలాంటి హింసాయుత తిరుగుబాటు ప్రబద్ధలవకుండా ముందు జాగ్రత్తతో గోర్బచెవ్ తన సంస్కరణలను ప్రవేశపెట్టాడు. 1989లో తూర్పు యూరపు దేశాల్లో ప్రజల మూకుమ్మడి తిరుగుబాట్ల తర్వాత రష్యాలో సంస్కరణల అమలును త్వరితం చేయక తప్పలేదు. 1989 సం॥లో అల్బేనియా తప్ప మిగతా అన్ని తూర్పు యూరపు దేశాల్లో ప్రజల సామూహిక తిరుగుబాటుతో పాత నియంతృత్వ పాలన అంతమైంది. అయితే దాని స్థానంలో కొత్త బూర్జువావర్గం ఆధిపత్యంలోకి వచ్చింది. ఇప్పుడు ఆ దేశాల్లో పాలన చేస్తున్నవారు దాదాపు అందరూ గతపాలనలో ఉన్నతస్థానాల్లో ఉన్నవారే.

రష్యాలో ప్రజల సామూహిక తిరుగుబాటు జరగకుండా గోర్బచేవ్ 'పెరిస్త్రోయికా' 'గ్లాస్‌నోస్త్'లాంటి గోసాయి చిట్కాలు వుపయోగించాడు. అయితే అవి వివిధ జాతుల సాయుధ తిరుగుబాట్లను మాత్రం ఆపలేకపోతున్నాయి. ఫిబ్రవరిలో రష్యా కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వంపై తన గుత్తాధిపత్యాన్ని విసర్జించింది. 'వ్యక్తిగత ఆస్తి' హక్కును గుర్తించ నిర్ణయించింది. మార్చిలో లిథువేనియా రాష్ట్రం సర్వస్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకుంది. కమ్యూనిస్టు పార్టీ ఒకవైపు అధికార వికేంద్రీకరణనంగీకరిస్తూనే, మరోవైపు అధ్యక్షుని చేతిలో సర్వాధికారాన్ని కేంద్రీకృతంచేయ ప్రయత్నిస్తూంది ఈలోగా బాల్టిక్ రిపబ్లిక్‌లన్నీ బహుళపార్టీ పద్ధతిని అమలుచేయడం, కమ్యూనిస్టుపార్టీ అజర్ బైజాన్‌శాఖ తన స్వతంత్రతను ప్రకటించుకోవటం, సోవియట్ రష్యాలోని వివిధ జాతులూ కేంద్రపాలన నుండి మరింత స్వేచ్ఛనూ కోరడం జరిగింది–

పై పరిణామాల మూలాలను వెలికితీయాలంటే పై దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీల చరిత్ర, కాలక్రమంలో అవి రివిజనిస్టులుగా యెలా మారాయో తెలుసుకొనడం అవసరం.

మొదటిప్రపంచ యుద్ధకాలంలో 1920 ప్రాంతాన పై తూర్పుయూరపు దేశాలన్నీ అప్పుడే చాలా నెమ్మదిగా పెట్టుబడిదారీ దేశాలుగా రూపుదెందుతున్న

భూస్వామ్య వ్యవస్థలు. వాటన్నిటిలో 'ఆస్ట్రో-హంగేరియన్', 'రష్యన్', 'హంగేరియన్' సామ్రాజ్యాలు పెద్దవి. 1917 లో జరిగిన రష్యా కార్మికవర్గ విప్లవం ఈ రాజ్యాల్లో జరుగుతున్న పెట్టుబడిదారీ విప్లవాలపై గొప్ప ప్రభావాన్ని చూపించింది. దాంతో 1918, 1919 లలో ఈ దేశాల్లో కార్మికుల తిరుగుబాట్లు, 'కార్మిక సోవియట్ల' నిర్మాణం జరిగాయి. హంగేరీలో కమ్యూనిస్టులు అధికారాన్ని చేజిక్కించుకొని 133 రోజులు పాలన చేశారుకూడా. అంతేగాక ఈ దేశాల్లో కమ్యూనిస్టు పార్టీల ఏర్పాటు ఈ కాలంలోనే జరిగింది. అయితే ఈదేశాల్లో జరిగిన పోరాటాల్లో 'సోషలిస్టు' లక్షణాలుగాక 'బూర్జువా ప్రజాస్వామ్య' లక్షణాలుండటం గమనార్హం. వీటిలో సామ్రాజ్యవాదులనే కాక కార్మికవర్గ ఆధిపత్యాన్ని ప్రతిఘటించే కొత్త కులక్ వర్గాలు, బూర్జువా వర్గాలు ప్రముఖపాత్ర వహించాయి. ఏమయినా ఈ తిరుగుబాట్లను సామ్రాజ్యవాదుల సహాయంతో విప్లవ ప్రతిపక్ష శక్తులు 1920 నాటికి తీవ్రంగా అణచివేశాయి. దాంతో భూస్వామ్య-బూర్జువా నియంతృత్వ ఆధిపత్యం తన పాలనను స్థిరపరచుకోగల్గింది. అదేవిధంగా 1929 ఆర్థిక సంక్షోభ కాలంలో చెలరేగిన ప్రజల తిరుగుబాట్లను అణచివేయటానికి పై పాలకవర్గాలు హిట్లర్ సహాయాన్ని అర్థించాయి. ఈవిధంగా తిరచుగా తమ పాలనకు ఎసరుపెడుతున్న కార్మికవర్గం పట్ల భయంతో ఆదేశాల్లో సామ్రాజ్యవాదులు, ఫాసిస్టులు బూర్జువా ప్రజాస్వామ్య విప్లవాన్ని పరిపూర్తికానివ్వలేదు. ఇక రెండవ ప్రపంచయుద్ధకాలంలో ఈ దేశాల్లోని పాలకవర్గం ఫాసిస్టు శక్తులకు దాసోహం అనడంతో 'ప్రజాస్వామ్య విప్లవం' మరింత వెనకబడింది. అయితే రెండవ ప్రపంచయుద్ధకాలంలో కమ్యూనిస్టులు, ప్రజాస్వామ్యశక్తులు ఫాసిస్టులకు పాక్షికమైన ప్రతిఘటన యిచ్చారు. కాని ఫాసిస్టు మూకలు ఎర్రసైన్యంచేతి ఓటమిచెందాకనే ఈ దేశాల్లో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం పూర్తయింది. 1944-45 లలో రష్యా సహాయంతో జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. ఆయా ప్రభుత్వాల్లో కమ్యూనిస్టులు భాగస్వాములయ్యారు కాని నాయకత్వ స్థానం వహించలేదు. ఈ దేశాల్లో కమ్యూనిస్టుపార్టీలు ప్రజల్లో వేళ్ళూనకపోవడం, బలహీనంగా వుండటం వల్ల, 1956 లో అవి పూర్తిగా అధికారంలోకి వచ్చినా శ్రామికవర్గ దృక్పథం ప్రజల్లో గట్టిగా ఏర్పడకపోవడంతో ఈ దేశాల్లో సోషలిస్టువ్యవస్థ పునాదులు బలపడలేదు. వాటిని పైనుండి ప్రజలపై బలవంతంగా రుద్దినట్లయింది. అందువల్ల 1956 లో రష్యాలో పెట్టుబడిదారీ వ్యవస్థ పునరుద్ధరణతో రష్యాపై ఆధారపడిన తూర్పుయూరపు దేశాలన్నీ పెట్టుబడిదారీ మార్గాన్నే అనుసరించాయి.

## ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం :

నేడు చాలామందిలో పెట్టుబడిదారీవ్యవస్థ అంటే వ్యక్తిగత ఆస్తి వుండటమని, సామ్యవాదమంటే ఆస్తులు జాతీయం చేయబడటం (ప్రభుత్వరంగం) అనే ఒక తప్పుడు భావన వుంది. మన దేశంలో కూడా సి.పి.ఐ, సి.పి ఐ (యం) లాంటి రివిజనిస్టు పార్టీలు జాతీయం చేయబడిన పరిశ్రమలు సోషలిస్టురంగానికి చెందినవని భావిస్తున్నాయి. అయితే ఈ ప్రభుత్వరంగంలోనూ కార్మికులు తీవ్రమైన దోపిడీకి గురవుతున్నారు. ఉన్నతాధికారులు, బ్యూరోక్రాట్లు అక్రమార్జనతో సంపన్నులవుతున్నారు. పెట్టుబడిదారీవ్యవస్థ అంటే నేడు 'వ్యక్తిగత ఆస్తి' వుండే వ్యవస్థే కాదు. సామ్రాజ్యవాదయుగంలో ప్రపంచ ఆర్థిక వ్యవస్థను తమ గుప్పిటలో వుంచుకున్న బహుళజాతి సంస్థల ఆధిపత్యంలో నేడు 'వ్యక్తిగతి'మైనదంటూ యేదీ వుండదు. అదేవిధంగా ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానానికి సోషలిజంతో యేమాత్రం సంబంధం లేదుకూడా. పెట్టుబడిదారీవ్యవస్థయొక్క అతి క్రూరరూపమయిన హిట్లర్ జర్మనీలో పెద్ద పరిశ్రమలన్నింటినీ జాతీయం చేశాడు. పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థలో అక్కడ నాయకత్వం వహించింది ప్రభుత్వమే-

పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ యే రూపంలో వున్నా అక్కడ సామూహిక ఉత్పత్తికి - వ్యక్తిగత ఆర్జనకు మధ్య ప్రధానమైన వైరుధ్యముంటుంది- ఇదే చివరకు 'వికేంద్రీకరణ శక్తుల'కు- కేంద్రీకృతశక్తులకు మధ్య వైరుధ్యానికి దారి తీస్తుంది. ఒకవైపు ఉత్పత్తిలో 'యాదృచ్ఛికత' (Spontaneity), అరాచకత్వం మరోవైపు పెట్టుబడిదారీ గుత్తాధిపత్యం - అధికార కేంద్రీకరణ జరుగుతుంది అన్ని పెట్టుబడిదారీ దేశాల్లో మాదిరే రష్యాలో కూడా పెట్టుబడిదారీ వర్గం నేడు ఈ వైరుధ్యాల్ని యెదుర్కొంటుంది. ఆర్థికవ్యవస్థ అరాచకంగా, అసమానంగా, ఎగుడుదిగుడులతో అభివృద్ధిచెందడంతో రష్యాలోని వివిధ గ్రూపుల మధ్య పోటీ అనివార్యమయ్యింది. ప్రజలపై ఆధారపడటం యిష్టం లేక - చేతకాక, ఉత్పత్తి విధానంలోని అరాచకత్వాన్ని క్రమబద్ధం చేయడానికై రష్యా పాలకులు 'విలువల సిద్ధాంతం'పై ఆధారపడ్డారు. అందువల్ల యిక్కడ మార్కెట్ శక్తులను విడుదల చేయడం, వ్యక్తిగత వ్యాపార స్వేచ్ఛ విస్తరించడం తప్పనిసరయింది- అందుకే నాడు 1965 లో చేసిన ఆర్థిక సంస్కరణలు, నేటి గోర్బచేవ్ 'పెరిస్త్రోయికా' అవసరాలయ్యాయి. గోర్బచేవ్ క్రుశ్చేవ్ వారసత్వాన్ని కొనసాగిస్తున్నాడు- అయితే మరోవైపు బూర్జువాపాలనలో

ఏకీకృతమైన ఆర్థిక, రాజకీయ అధికారం, దానిపై కమ్యూనిస్టుపార్టీ గుత్తాధిపత్యం వుంది. అందువల్ల పెట్టుబడిదారీవ్యవస్థలోని ఉత్పత్తి యాదృచ్ఛికత, అరాచకత్వం, స్వేచ్ఛ మార్కెట్‌శక్తులకు- కమ్యూనిస్టుపార్టి యొక్క అధికార గుత్తాధిపత్యానికి వైరుధ్యం తీవ్రమైంది. దాంతో నేడు రష్యా ఆర్థికవ్యవస్థ కేంద్రీకరణ - వికేంద్రీకరణల మధ్య ఊగిసలాడుతూంది.

## సామ్యవాదం :

ఉత్పత్తిసాధనాలపై వ్యక్తుల ఆధిపత్యం, తద్వారా శ్రామికులు ఉత్పత్తి చేసిన అదనపు విలువ దోపిడి- వీటిని రూపుమాపడం ద్వారా సామ్యవాదం పె.బ.దా. వ్యవస్థలోని ప్రధాన వైరుధ్యాన్ని పరిష్కరిస్తుంది. సామ్యవాద వ్యవస్థలో ఉత్పత్తి లక్ష్యం లాభార్జనగాదు. ఉత్పత్తి ప్రజల అవసరాలను తీర్చడంకోసం. అదేవిధంగా సోషలిస్టువ్యవస్థలో ప్రభుత్వం ధనాన్ని పెట్టుబడిదారుల సహాయానికి, రక్షణకు గాక ప్రజల సంక్షేమ కార్యక్రమాలకై ఖర్చు పెడుతుంది.

పె.బ.దా. వ్యవస్థ యొక్క ప్రధాన లక్ష్యం లాభాన్ని సృష్టించడమే. ఉత్పత్తిలో అరాచకత్వం, మార్కెట్‌శక్తుల మార్పులకు (Vagaries) లోనయిన ఆర్థికవ్యవస్థ పె.బ.దా వ్యవస్థ యొక్క లక్షణాలు. 1929-30 లలో పె.బ.దా వ్యవస్థ తీవ్రమైన ఆర్థిక సంక్షోభానికి గురయ్యింది. దాంతో కీయిన్స్ (Keynes) సిద్ధాంతం ద్వారా ఆర్థికవ్యవస్థలో కొంత స్థిరత్వం సాధించే ప్రయత్నం జరిగింది. కీయిన్స్, ఆర్థికవ్యవస్థలో, ప్రభుత్వ జోక్యాన్ని కోరుతాడు. రాజ్యం జాతీయంచేయబడిన రంగంద్వారా ఆర్థికంగా పారిశ్రామికంగా ప్రముఖపాత్ర వహిస్తూ ఆర్థికవ్యవస్థలో జోక్యంచేసుకొని దాన్ని క్రమబద్ధీకరణచేయ ప్రయత్నిస్తుంది. ఈనాడు అన్ని మూడవ ప్రపంచదేశాల్లోని ఆర్థిక వ్యవస్థలలో 70% పై ప్రభుత్వరంగ ఆధిపత్యం వుంది. దీన్ని మనం సామ్యవాదంగా పరిగణించరాదు. ఇది ప్రభుత్వ పె.బ.దా. విధానం. భారతదేశంలో 1944 లో టాటా, బిర్లా మరియు యితర పె.బ.దా. వర్గాల సలహాలమేరకు బొంబాయి ప్రణాళికను అమలుచేయడం ఆరంభించారు అయినా సి.పి.ఐ, సి.పి.ఐ(యం)లాంటి పార్టీలు ఈ రంగాన్ని సోషలిస్టురంగంగా పరిగణిస్తున్నాయి.

ఉత్పత్తి సాధనాలు వ్యక్తుల ఆధీనంలో వుండకపోవడం ప్రభుత్వ పె.బ.దా. వ్యవస్థను సామ్యవాదవ్యవస్థగా పరిగణించేందుకు దోహదం చేస్తుంది.

అయినా ప్ర.పె.బ.దా. వ్యవస్థలో అదనపు విలువను పొందేవారు మాత్రం ప్రైవేటు వ్యక్తులే. వీరు ఉన్నత అధికారులు, పార్టి నాయకులు, ఉన్నతశ్రేణి నిపుణులు మరియు మేనేజర్లు. సోషలిజంలో ఉత్పత్తి క్రమంలో సృష్టించబడ్డ అదనపు విలువ తిరిగి ప్రజల కవసరమైన సరుకుల ఉత్పత్తికై వినియోగిస్తారు. కాని ప్రభుత్వ పె.బ.దా. వ్యవస్థలో ఈ అదనపు విలువను పెట్టుబడిదారుల కవసరమైన వనరులను, భారీయంత్రసామాగ్రిని (infrastructure) సమకూర్చడానికి వినియోగిస్తారు అదేవిధంగా ఉన్నత అధికారులు, బ్యూరోక్రాట్లు పార్టి సభ్యులు సంపన్నులవుతారు. సోషలిజంలో ప్రజల నిత్యావసర వస్తూత్పత్తికి ప్రాధాన్యత వుండే పె.బ.దా. వ్యవస్థలో ఉన్నతవర్గాల అవసరాలను తీర్చడం ప్రధాన లక్ష్యమవుతుంది. ప్రజల మౌలికావసరాలను తీర్చడానికనుగుణంగా, సోషలిజంలో, ఉత్పత్తి విధానం, పంపిణీ, ధరలు నిర్ణయించబడుతాయి. కాని పె.బ.దా. విధానంలో ప్రైవేటురంగంలో లాభాలద్వారా, ప్రభుత్వరంగంలో అవినీతిద్వారా అదనపు విలువను దోపిడీ చేయడానికి అనుగుణంగా ఆర్థికవ్యవస్థ క్రమబద్ధం చేయబడుతుంది సోషలిస్టువ్యవస్థలో మేధో-శారీరక శ్రమల మధ్య వ్యత్యాసాన్ని తగ్గించే ప్రయత్నం జరుగుతుంది. పె.బ.దా. వ్యవస్థలో మానసిక శ్రమకు అత్యంత ప్రాధాన్యత యివ్వడం ద్వారా కొత్త పాలకవర్గాలకు సాంకేతిక నిపుణులు పునాదులుగా వుంటారు. సామ్యవాదంలో ఉత్పత్తి, పంపిణీ విధాన నిర్ణయాల్లో శ్రామికుల పాత్ర వుంటుంది. ప్రభుత్వ పె.బ.దా. విధానంలో శ్రామికులు ఉత్పత్తి నుండి పరాయికరణచెంది, విధాన నిర్ణయాలు కేవలం పార్టి అధినేతల, మేనేజర్ల, సాంకేతిక నిపుణులచే చేయబడుతాయి.

సామ్యవాద విధానాన్ని అమలుచేయడం వల్లనే రష్యాలో తొలి 80 సం॥లు నిత్యావసర వస్తువుల ధరలు పెరగలేదు; 20 సం॥లలో నిరుద్యోగం రూపుమాపబడ్డది. సమాజంలో అసమానతలు మానసిక - శారీరక శ్రమల మధ్య తేడాలు క్రమంగా తగ్గించబడ్డాయి. విలువల సిద్ధాంతం నియంత్రించబడి, మార్కెట్ శక్తుల ప్రభావం తగ్గించబడింది. అయితే ప్రభుత్వ పె.బ.దా. వ్యవస్థ రూపంలో పె.బ.దా. వ్యవస్థ పునరుద్ధరింపబడేసరికి ధరల పెరుగుదల, నిరుద్యోగం, శ్రామికుల - సాంకేతిక నిపుణుల మేనేజర్ల మధ్య తేడాలు పెరగడం, విలువల సిద్ధాంతం మార్కెట్టు శక్తులు అభివృద్ధిచెంద నారంభించాయి. నేడు రష్యా తదితర తూర్పుయూరపుదేశాల సంక్షోభాలు ప్రభుత్వ పె.బ.దా. వ్యవస్థలలో 'మార్కెట్ శక్తులు' సృష్టించిన వైరుధ్యాల ఫలితమే. అందువల్లనే

రష్యాలో 'పెరిస్త్రోయికా' లాంటి ఆర్థికసంస్కరణలు అమలుపరచి ఉత్పత్తి శక్తులు మరింత అభివృద్ధిచెందేందుకు అవకాశాలు కల్పించవలసి వచ్చింది.

## సోవియట్ రష్యా :

కృశ్చేవ్ అధికారంలోకి రాగానే తన మూడు 'శాంతి' సిద్ధాంతాలు 'శాంతియుత పోటీ', 'శాంతియుత సహజీవనం', 'శాంతియుత మార్పు'ల పేరుతో మార్క్సిజంపై దాడి ప్రారంభించాడు. స్టాలిన్‌పై విమర్శ నెపంతో కృశ్చేవ్ మార్క్సిజం మౌలికసూత్రాలయిన 'రాజ్యం మరియు విప్లవం' పై దాడిచేశాడు. ఆ తర్వాత కమ్యూనిష్టుపార్టీ యొక్క వర్గ లక్షణంపై మార్పు తెచ్చి 'కార్మికవర్గ నియంతృత్వమనే' సిద్ధాంతంపైనే తీవ్రమైన దాడినారంభించాడు. సీనియర్ కమ్యూనిస్టు నాయకులను బహిష్కరించడమో, జైల్లోతోయడమో జరిగింది. 1958 నాటికి మొదటినుండి కమ్యూనిస్టుపార్టీలో వున్న సభ్యులు 70% తొలగింపబడ్డారు. వారి స్థానాల్లో యింకా యెక్కువ శాతం సాంకేతిక నిపుణులను, బ్యూరోక్రాట్లను నియమించారు. ఆ విధంగా కమ్యూనిస్టుపార్టీ యొక్క వర్గలక్షణం (class character) మార్పుచేయబడింది. ఇక సామ్యవాద ఆర్థికవ్యవస్థ ప్రభుత్వ పెట్టుబడిదారీవ్యవస్థగా రూపాంతరంచెందింది. 1960 నాటికి ఈ మౌలికమైన తిరోగమన మార్పులన్నీ పూర్తయ్యాయి. 1958 తర్వాత రష్యా ఆర్థికవ్యవస్థలో కృశ్చేవ్ తెచ్చిన మార్పులను కొన్నిటిని తెలుసుకుందాం.

1) గతంలో వున్న ప్రభుత్వ సహకార వ్యవసాయపద్ధతి తొలగించబడింది. భూమిని 5 లేక 6 మంది కల్గిన గ్రూపులకు పంపిణీ చేశారు (ఈ గ్రూపులను జ్వెనోస్ Zvenos అంటారు). దీంతో సోషలిస్టు ఉత్పత్తి విధాన స్థానంలో ప్రైవేటు ఉత్పత్తి విధానం మొదలయింది. ప్రైవేటు భూములలో పంటలు పండించడం, వాటిని ప్రైవేటు మార్కెట్‌లో అమ్మడంతో గ్రామీణ ప్రాంతాలలో అంతవరకు సామరస్యంగా సాధింపబడి, యింకా పూర్తిగా స్థిరపడని సోషలిస్టు సంబంధాలు దెబ్బతిన్నాయి. ఈ జ్వెనోస్ పద్ధతి ఒకవైపు ప్రైవేటు ఉత్పత్తిని అభివృద్ధిచేయడమేగాక, మరోవైపు సహకార వ్యవసాయ క్షేత్రాలను లాభాలను సంపాదించే ప్రైవేటు వ్యవసాయక్షేత్రాలుగా మార్చింది. దీంతో కేవలం జ్వెనోస్‌లలో భాగస్వాములేగాక, సహకార, ప్రభుత్వక్షేత్రాల మేనేజర్లు, సాంకేతికనిపుణులు కూడా గ్రామప్రాంతాలలో పెట్టుబడిదారులుగా తయారయ్యారు. వ్యవసాయరంగ నాయకత్వం నుండి అనుభవశీలురైన

రైతాంగ కార్యకర్తలను తొలగించి వారిస్థానంలో పెట్టుబడిదారీ మనస్తత్వం గల సాంకేతికనిపుణులను వేలకొద్ది నియమించారు. కమ్యూనిస్టుపార్టీ గ్రామీణ ప్రాంతాలలోని ఈ కొత్త కులక్‌వర్గాన్ని, గ్రామీణ పెట్టుబడిదారీ వర్గానికి, కేంద్ర గుత్తపెట్టుబడిదారీవర్గానికి మధ్య లంకెగా వినియోగించింది.

2) పరిశ్రమలలో 'లాభమే' ముఖ్యలక్ష్యమయ్యింది. ఉత్పత్తి లక్ష్యం లాభాలను పెంచడమే. దానికనుగుణంగా ఆర్థికవ్యవస్థ 'విలువల సిద్ధాంత' ఆధిపత్యానికి గురయింది ఉత్పత్తికయ్యే ఖర్చు, దాని వడ్డీని పెట్టుబడిగా పరిగణించడం మొదలయింది.

3) శ్రామికుల వేతనాలు స్టాలిన్ కాలంలో ప్రణాళికాబద్ధం చేయబడింది. కాని కృశ్చేవ్/బ్రెజ్నేవ్ కాలాలలో అలాకాక ఒక పరిశ్రమలో మొత్తం వేతనాలకయ్యే ఖర్చును మాత్రమే నిర్ణయించబడేది. దీంతో శ్రామికుల వేతనాలను తమ యిష్టానుసారం నిర్ణయించే అధికారం మేనేజర్లకివ్వబడింది. ఇది పరిశ్రమలలో వర్గాలేర్పడడానికి దారితీసింది. 1965 లో ఒక ఫ్యాక్టరీలో శ్రామికుని వేతనం 23% పెరగగా, మేనేజర్ వేతనం 62% పెరిగింది. మరో ఫ్యాక్టరీలో కార్మికుని వేతనం 75 రూబుళ్ళుకాగా, మేనేజర్ వేతనం 1,000 రూబుళ్ళు వుండింది.

4) స్టాలిన్ కాలంలో ప్రజావసరాలను ఉత్పత్తిచేసే, అభివృద్ధిచెందాల్సిన పరిశ్రమలకు ప్రభుత్వం గ్రాంట్లు మంజూరు చేసేది. కృశ్చేవ్/బ్రెజ్నేవ్‌లు ఈ గ్రాంట్లును ఋణాలుగామార్చి వాటిని కూడా ఎక్కువ లాభాలను తెచ్చిపెట్టే పరిశ్రమలకు మాత్రమే మంజూరు చేసేవారు.

5) స్టాలిన్ కాలంలో పెట్టుబడిని వివిధ రంగాల్లో విస్తృతం చేయగా కృశ్చేవ్/బ్రెజ్నేవ్‌లు పెట్టుబడిని కేవలం లాభాలను తెచ్చిపెట్టే రంగాల్లోనే కేంద్రీకృతం చేశారు. సోషలిజంలో పెట్టుబడికి ఉత్పత్తిని విస్తృతం చేయడం లక్షణంగా ఉంటుంది. అది కార్మికులను దోచదు. దీన్ని విస్తృత పెట్టుబడి అంటారు. కాని పెట్టుబడిదారీ వ్యవస్థలలో పెట్టుబడి కార్మికులను దోచి లాభాలను సమకూర్చడమే లక్ష్యమవుతుంది ఇక్కడ ఉత్పత్తి పెరుగుదల ఆధునికీకరణ, శ్రమను తగ్గించే పద్ధతుల అమలుద్వారా సాధిస్తారు. ఇటువంటి తీవ్రమైన అభివృద్ధి (intensive development) ని 'ఉత్పత్తి శక్తుల సిద్ధాంతం అంటారు. రష్యాలో కృశ్చేవ్/బ్రెజ్నేవ్‌లు, చైనాలో 'నాలుగు ఆధునికీకరణల' పేరిట డెంగ్ అమలుపరుస్తున్నదిదే.

సోషలిజంలో కొత్త పరిశ్రమల నెలకొల్పడంద్వారా విస్తృత పెరుగుదల (extensive development) వుంటే పెట్టుబడిదారీ విధానంలో ఉన్న పరిశ్రమలలోనే యంత్రాల ఆధునికీకరణద్వారా ఉత్పత్తిని పెంచడం జరుగుతుంది. దీన్ని 'తీవ్రమైన అభివృద్ధి' (intensive development) అంటారు.

పై మార్పులను అమలుచేయడంద్వారా కృశ్చేవ్ ఆ తర్వాత బ్రెజ్నేవ్‌లు రష్యాలో పెట్టుబడిదారీ వ్యవస్థను విజయవంతంగా పునరుద్ధరించారు.

## సోషలిస్టు నిర్మాణం :

రష్యాలో మొదటినుండి అమలుచేయబడిన సోషలిస్టు నిర్మాణపద్ధతులను నిశితంగా పరిశీలిస్తే కృశ్చేవ్‌తో పునరుద్ధరింపబడిన పెట్టుబడిదారీ విధానానికి బీజాలు అంతకుముందు కాలంలోనే వేయబడ్డాయని తెలుస్తుంది. ప్రపంచంలో సోషలిస్టు నిర్మాణ పద్ధతి అమలు రష్యాలో మొదటి అనుభవం కావడంతో, ఆ క్రమంలో కమ్యూనిస్టుపార్టీ ఎన్నో పొరపాట్లను చేసింది. సోషలిస్టు సిద్ధాంత పాలసీ అమలుచేయడంలో స్టాలిన్ చేసిన పొరపాట్లే ఆ తర్వాతికాలంలో రష్యాలో పె.బ.దా. శక్తులు తలెత్తడానికి దోహదంచేశాయి. ఆ ఫలితమే 1956 లో అధికారంలోకి వచ్చిన కృశ్చేవ్. కృశ్చేవ్ పె.బ.దా. శక్తుల ప్రతినిధి. స్టాలిన్ కాలంలో జరిగిన పొరపాట్లను కొన్నిటిని పరిశీలిద్దాం.

అ) స్టాలిన్ కాలంలో కమ్యూనిస్టు పార్టీ ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని మాత్రమే కృషిచేసింది. స్టాలిన్ ఉత్పత్తిశక్తుల సిద్ధాంత ఊబిలో చిక్కుకొని సోషలిస్టు వ్యవస్థను పటిష్టం చేయడానికి అవసరమైన వర్గపోరాటాన్ని విస్మరించాడు. వ్యవసాయ, పారిశ్రామిక రంగాల మధ్య సమతుల్యతను పట్టించుకోక సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధికి కేవలం భారీపరిశ్రమల అభివృద్ధిమాత్రమే ముఖ్యమని భావించాడు.

ఆ) సిద్ధాంతపరంగా కమ్యూనిస్టుపార్టీ ఉత్పత్తి సంబంధాల అభివృద్ధికి మెరుగుదలకు సిద్ధాంతపరమైన అభివృద్ధి అవసరమనే విషయం విస్మరించింది. అదేవిధంగా స్టాలిన్ ఉత్పత్తి శక్తుల అభివృద్ధి కుంటుపాటుకు, ఉత్పత్తిసంబంధాల వెనుకపాటుతనమే కారణమనే విషయాన్ని మరిచాడు. ఉత్పత్తి శక్తులలో మార్పువస్తే ఉత్పత్తి సంబంధాలలో మార్పు వస్తుందని స్టాలిన్ భావించాడు.

ఇ) త్వరితగతిన అభివృద్ధి సాధనకు, ఆర్థికాభివృద్ధికి స్టాలిన్ కార్మికుల, శ్రామికులపై ఆధారపడలేదు నిపుణుల, మేనేజర్ల, మేధావులపై ఆధారపడ్డాడు.

ఈ) పెరుగుతున్న ఉత్పత్తి శక్తుల కనుగుణంగా ఉపరితలాంశాల్లోని సంబంధాలలో మార్పు రావాలనే విషయం స్టాలిన్ విస్మరించాడు.

ఉ) స్టాలిన్ సోవియట్ కమ్యూనిస్టు పార్టీని వర్గరహిత పార్టీగా తలచాడు. అంతర్గత పోరాటం, తద్వారా గతితార్కికంగా భావాల సంఘర్షణల ద్వారా సరియైన పంథా నిర్ణయించబడుతుందనే విషయం స్టాలిన్ పట్టించుకోలేదు. అందువల్ల పార్టీలో బ్యూరోక్రటిక్ ధోరణులు, నియంతృత్వ పైఖరి పెరిగింది

పై విధంగా స్టాలిన్ కాలంలోని తప్పుడు ధోరణులు బీజరూపంలో వుండి ఆ తర్వాత క్రుశ్చేవ్ కాలం నాటికి పెట్టుబడిదారీశక్తుల ఆవిర్భావానికి దారితీశాయి. అలాంటి తప్పుడు ధోరణులు మావో పసికట్టి చైనా ఆర్థిక ప్రణాళికలో అవి తలెత్తకుండా చూడగలిగాడు. ఆ తప్పుడు ధోరణుల నుండి పార్టీని రక్షించడానికి మావో మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవానికి పిలుపునిచ్చా అయితే స్టాలిన్ కాలంలో తప్పుడు ధోరణులు తలెత్తడానికి కారణం రష్య సోషలిస్టు నిర్మాణం తొలిఅనుభవం కావడమే. గతంలో ప్రపంచంలో యెక్కడా సోషలిస్టువ్యవస్థ నిర్మాణ అనుభవాలు ఆనాటి రష్యాకు మార్గదర్శకమవడానికి అవకాశంలేదు. అంతేగాక సోషలిస్టు నిర్మాణాన్ని పురిటిలోనే సంధి కొట్టించానే సామ్రాజ్యవాద దేశాల కుట్రను రష్యా విప్లవం తర్వాత వెంటనే యెదుర్కోవాల్సివచ్చింది. 1927 వరకు బోల్షివిక్‌పాలన పటిష్టమొందింపటకై సామ్రాజ్యవాద దేశాల 'తెల్లసైన్యం' సహాయంతో రష్యాలోని విప్లవ ప్రతీఘాత శక్తులు అంతర్యుద్ధం కొనసాగించడంతో, స్టాలిన్, కమ్యూనిస్టుపార్టీ దేశాన్ని రక్షించుకొనే యత్నంలో సోషలిస్టు సంబంధాల స్థాపనను నిర్లక్ష్యం చేశారు. ఆ తర్వాత కూడా 1939 నుంచి 45 వరకు రెండవ ప్రపంచయుద్ధకాలంలో నాజీ సైన్యాల తీవ్రమైనదాడి యెదుర్కొన్నదీ, దాన్ని ఓడించడానికి 20 మిలియన్ల ప్రజల్ని పోగొట్టుకొన్నదీ సోవియట్ రష్యానే. అందువల్ల ఆనాటి పొరపాట్ల వెనుక చారిత్రక భౌతిక పరిస్థితుల ఒత్తిడి వుందనే విషయం అర్థమవుతుంది.

కాని క్రుశ్చేవ్ యొక్క పెట్టుబడిదారీ పంథా స్టాలిన్ నిర్మాణ విషయంలో చేసిన తప్పులతో పోలిస్తే గుణాత్మకంగా భిన్నమైంది. ఇక అతని వారసులవి తెలియకుండా చేసిన పొరపాట్లు కావు. వారు సోషలిస్టువ్యవస్థను ఛిన్నాభిన్నం చేసిన విప్లవద్రోహులు, పెట్టుబడిదారీవర్గ ప్రతినిధులు.

## ఆర్థికరంగ పునాదులు :

ఇప్పుడు రష్యాలో ప్రవేశపెట్టిన ఆర్థిక సంస్కరణలు కొత్తవేమీ కావు. వీటిని యుగస్లేవియా, హంగేరీలలో చాలా సంవత్సరాలక్రితమే ప్రవేశపెట్టారు. ప్రభుత్వ పెట్టుబడిదారీవ్యవస్థ, అభివృద్ధిని నిరోధించి నిత్యావసర వస్తువుల కొరతను పెంచి, ఉత్పత్తిశక్తుల పెరుగుదలను అరికట్టుతూ రష్యా తదితర తూర్పుయూరపుదేశాల ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాల్లో సంక్షోభాన్ని సృష్టించింది. వాటి ఆర్థిక పునాదుల్ని చెదపురుగులాగా తొలిచివేసింది. ఉదాహరణకు 1985 లో రష్యాలో తిండిగింజల ఉత్పత్తి 1918 నాటి స్థాయికి దిగజారింది. (ఒక వ్యక్తికి సంవత్సరానికి 0.68 టన్నులు మాత్రమే). ఇజ్వెస్తియా అనే పత్రిక ప్రకారం రష్యామార్కెట్ నుండి టవళ్ళు, టూత్‌పేస్టు, లోషన్, చక్కెర, బట్టలు మొదలైన నిత్యావసర సరుకులు ఒకదాని తర్వాత మరొకటి మాయమయ్యాయి. ఇక డిటెర్జంటులు, చవకరకం సబ్బుల ఊసేలేదు. రుమేనియాలో గత ఆరు సంవత్సరాలుగా ప్రజలు కడు దీనస్థితిలో జీవనం కొనసాగిస్తున్నారు. సుసంపన్నమైన వ్యవసాయరంగం కల్గివుండి కూడా రుమేనియా ప్రజలు ఆహారపదార్థాల రేషన్‌కు గురయ్యారు. అక్కడ చాలా మంది పిల్లలు పండ్లు ఎరగరు. విద్యుత్‌కొరత విపరీతంగా వుంది. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థకు అప్పుల చెల్లింపుకై, దేశావసరాల విస్మరించి బొగ్గు, చమురు ఎగుమతులు చేయడంతో రుమేనియన్లు చలికాలంలో తీవ్రమైన చలికి గురయ్యారు. ఇక పోలెండు ప్రజలు తీవ్ర ఆర్థిక సంక్షోభానికి గురయ్యారు ద్రవ్యోల్బణం 740% చేరుకోగా, నిరుద్యోగుల సంఖ్య 5 లక్షలకు చేరింది యుగోస్లేవియాలో ద్రవ్యోల్బణం 2,500%. మిగతా దేశాలకన్నా పటిష్టమైన ఆర్థికవ్యవస్థ కల్గిన తూర్పుజర్మనీలో గత సంవత్సరం పెరుగుదల రేటు 2% మాత్రమే. ఇది గత 31 సం॥రాల పెరుగుదలతో పోలిస్తే అతి తక్కువ.

ప్రభుత్వ పెట్టుబడిదారీవ్యవస్థలయిన ఈ దేశాల్లో అలా సంక్షోభం పెరగడానికి కారణాలు రెండు. అందులో మొదటిది అతి పెద్దదైన బ్యూరోక్రసి, సైన్యం దేశ ఆర్థికవ్యవస్థపై కల్గిస్తున్న అపార భారం. ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానంలో అధికార యంత్రాంగం విస్తృతమవుతుంది. దానితోపాటు రష్యా విస్తరణకాంక్ష సైన్యంపై ఖర్చును విపరీతంగా పెంచివేసింది. రష్యాలో అధికారులసంఖ్య 2 కోట్లు అంటే ప్రతి ఆరుగురికి ఒక అధికారి అన్నమాట. బ్యూరోక్రసి నుండి ఆదాయం సంవత్సరానికి 2 వేలకోట్ల రూబుల్స్‌కాగా,

దానిపై ఖర్చు 4 వేలకోట్ల రూబుల్స్. ఇక 1990 లో దేశరక్షణకై 8% తగ్గించాక కూడా మిలటరీపై ఖర్చు 7 వేల కోట్ల రూబుల్స్. రష్యా సైన్యంలో 6 లక్షల సైనికులు విదేశాల్లో వున్నారు. పై విధంగా ఉత్పత్తేతర రంగంలో అతిపెద్ద యెత్తున దేశ సంపద ఖర్చుకాగా ఉత్పత్తిశక్తుల పెరుగుదల అరికట్టబడి ఆర్థికమాంద్యత (stagnation), కొరత ఏర్పడింది.

ఈ దేశాల్లో ఆర్థిక సంక్షోభానికి రెండవ కారణం ప్రభుత్వ పెట్టుబడిదారీ వ్యవస్థలో సహజంగా యేర్పడే కార్మిక శక్తి యొక్క సోమరితనం. కార్మిక శక్తి, యంత్రాలు ఈ రెండూ ఉత్పత్తిశక్తులలో ముఖ్యమైన భాగాలు. సోషలిస్టువ్యవస్థలో కార్మికుడు తాను సృష్టించిన ఉత్పత్తి నుండి పరాయీకరణ చెందడు. అంతేగాక అతడు తన సామాజిక బాధ్యతగా ఉత్పత్తిని పెంచేందుకు ప్రయత్నిస్తాడు. తను ఉత్పత్తి చేసిన సరుకు తన వర్గమే అనుభవిస్తున్నదనే భరోస అతన్ని ఉత్పత్తిని పెంచేందుకు పురికొల్పుతూంది. దీనికి ఉదాహరణగా 1931 లోని 'స్టాట్‌క్నోవ్' ఉద్యమాన్ని చెప్పవచ్చు. (దేశంలోని కొరతను నివారించటకై కార్మికులు ఎలాంటి అదనపు వేతనాన్ని ఆశించకుండా ఎక్కువకాలం పనిచేశారు). అదేవిధంగా కార్మికులు, కర్షకులు వారి స్వంత చొరవతో చమురు లభ్యంకాదని చెప్పబడే ప్రదేశంనుండి లక్షల బ్యారెల్ల చమురు వెలికితీయడం ఎడారిలాంటి భూముల్లో పంటలు పెద్దయెత్తున పండించడం, చైనాలోని 'టాచాయ్ సూసె భూములు' మరియు 'టాచాయ్ కమ్యూన్'లు చైనా కార్మికుల సామాజిక బాధ్యతకు, విప్లవ చైతన్యానికి మచ్చుతునకలు.

పై విధంగా ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి సోషలిజం కార్మికశక్తిపై ఆధారపడుతుంది. కాని పెట్టుబడిదారీ వ్యవస్థలో పాలకవర్గం యంత్రాల ఆధునికీకరణ, సాంకేతిక జ్ఞానంపై ఆధారపడి ప్రజల్ని విస్మరిస్తారు. అందువల్లే క్రుశ్చేవ్, డెంగ్‌లు రష్యా, చైనాలలో పెట్టుబడిదారీ వ్యవస్థను పునరుద్ధరించాక ఉత్పత్తి పెరుగుదలకు, ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి కార్మికశక్తిపై ఆధారపడక "ఉత్పత్తిశక్తుల సిద్ధాంతం", "నాలుగు ఆధునికీకరణలు" లాంటి సిద్ధాంతాలపై ఆధారపడ్డారు. పెట్టుబడిదారీ వ్యవస్థ కార్మికుల ఉత్పాదకశక్తిని పెంచడానికి వారికి 'రాయితీలు', 'బోనస్' లివ్వడం చేస్తుంది.

వచ్చిన చిక్కేమిటంటే ప్రభుత్వ పెట్టుబడిదారీ వ్యవస్థ సోషలిస్టు లేక పెట్టుబడిదారీ వ్యవస్థలవలంబించే పద్ధతుల్ని పూర్తిగా అమలుచేయలేదు. ప్రభుత్వ పెట్టుబడిదారీ వ్యవస్థలో పెట్టుబడిదారీ వ్యవస్థలోని 'పోటీ' చొరవ

లోపిస్తుంది. ప్రభుత్వ పెట్టుబడిదారీ వ్యవస్థలో 'అదనపు విలువ' సంస్థాపరంగా పొందక మోసపూరిత పద్ధతుల్లో దోచబడుతుంది. ఉత్పత్తినుండి శ్రామికులు పరాయీకరణ చెందుతారు. ప్రభుత్వ పెట్టుబడిదారి వ్యవస్థలో సోమరితనం ఎలా పెరుగుతుందో చూడడానికి మన దేశంలోని ప్రభుత్వరంగ సంస్థలు, కార్యాలయాలు, బ్యాంకులు మంచి ఉదాహరణలు. ఈ సమస్యను అధిగమించడానికే రష్యా తదితర తూర్పు యూరపు దేశాల్లో ఆర్థికరంగంలో పశ్చిమ దేశాల ఆర్థికరంగ నియమాల అమలుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి ఈ క్రమంలో ఆ దేశాల పాలకవర్గం రెండురకాల యిబ్బందుల నెదుర్కొంటున్నది. ఒకటి పాలకవర్గ దోపిడీకి, నియంతృత్వ పాలనకు వ్యతిరేకంగా ప్రజల సామూహిక తిరుగుబాట్లు. రెండు ప్రభుత్వ పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఉన్న అవరోధాలను తొలగించేందుకు పాలకవర్గంలో ఒక సెక్షన్ అమలుచేయాలనుకున్న పెట్టుబడిదారీ సంస్కరణలపట్ల వ్యతిరేకత. గత పాలకవర్గంలో బాగా లాభం పొందినవారు ఈ సంస్కరణలు వ్యతిరేకిస్తున్నారు. ఈ పరిణామాలే మనకు తూర్పుయూరపు దేశాల్లో చైనాలో, రష్యాలో కన్పించేవి.

## విశ్వవ్యాప్తమైన సత్యం (Universal Truth) :

రష్యా, తూర్పు యూరపు దేశాల్లో సంభవించిన పరిణామాలు, రెండు అగ్రరాజ్యాల మధ్య ఘర్షణలు చల్లబడటం, 1992 నాటికి యూరోపు మొత్తం 'ఒకే దేశం'గా సంలీనం అయ్యే అవకాశాలు, సామ్రాజ్యవాద ప్రపంచంలో జపాను మరియు జర్మనీలు అత్యంత త్వరితంగా బలమైన ఆర్థిక శక్తులుగా బలపడటం, రష్యా, అమెరికాలు అగ్రరాజ్యాలుగా బలహీనపడటం, ఉభయ జర్మనీలు ఏకీకరణచెందితే 'విశాల జర్మనీ' అవతరిస్తుందనే భయాందోళనలు - ఈ సంఘటనలన్నీ పెట్టుబడిదారీ / సామ్రాజ్యవాద ప్రపంచంలో జరగబోయే గొప్పమార్పులకు, సామ్రాజ్యవాద దేశాలమధ్య కొత్త ఐక్యసంఘటనలు ఏర్పడడానికి సూచికలుగా భావించవచ్చు. తూర్పు యూరపు దేశాల్లో రాజకీయ మార్పులను హర్షిస్తూనే రష్యా మరోవైపు 'వార్సా సైనిక ఒడంబడిక' కొనసాగాలనే వాంఛిస్తుంది (కొత్తగా పాలనలోకి వచ్చిన సాలిడారిటీ ప్రభుత్వాధినేతలు వార్సా ఒప్పందాన్ని సమర్థించడం గమనార్హం). రష్యా కొత్త ఐక్య సంఘటనల (realignment) ద్వారా తూర్పు యూరపు దేశాల్లో తన ప్రాబల్యాన్ని పటిష్టం చేసుకుంటూనే, మార్క్సిస్టు సిద్ధాంతాల సడలింపుద్వారా పశ్చిమ

యూరోప్‌లో తన ప్రాబల్యాన్ని పెంచుకోచూస్తుంది. మరోవైపు అమెరికా కూడా పశ్చిమ దేశాలపై తన పట్టు సడలకుండా చూస్తూ, తూర్పు యూరపు దేశాల్లోని కొత్త ప్రభుత్వాలను సమర్థిస్తూ ఆ దేశ మార్కెట్లనాక్రమించ ప్రయత్నిస్తుంది. ఇప్పటికే పోలెండుకు ప్రపంచ బ్యాంక్ 30 కోట్ల పౌండ్ల ఋణం మంజూరుచేసింది. అంతేగాక వచ్చే మూడు సంవత్సరాల్లో తూర్పు యూరపు దేశాలకు ప్రపంచ బ్యాంక్ 500 కోట్ల పౌండ్ల ఋణాన్ని మంజూరు చేయనుంది. హంగరీ, ఇజ్రాయిల్ మరియు దక్షిణ ఆఫ్రికా దేశాలతో దగ్గరి సంబంధాలు నెలకొల్పుకుంది.

రెండు అగ్రరాజ్యాలు రష్యా, అమెరికాలు ప్రపంచంపై తమ ఆధిపత్యాన్ని నిలుపుకునే ప్రయత్నం చేస్తున్నాయి. అయితే వాటికి 'విశాల జర్మనీ', నూతన జపాను 'సామ్రాజ్యా'ల ఏర్పాటు భయంపట్టుకుంది. అందువల్ల రాబోయే కొలది సంవత్సరాలలో సామ్రాజ్యవాద దేశాల మధ్య కొత్త సైనిక ఒడంబడికలు, స్నేహ ఒప్పందాలు ఏర్పడే సూచనలున్నాయి. దాంతో పాత ధ్రువబలస్థానంలో కొత్త ధ్రువణలు జరిగే అవకాశం వుంది.

అయితే పెట్టుబడిదారీవ్యవస్థ యొక్క పరిస్థితి అలావుంటే కమ్యూనిజం యొక్క భవిష్యత్తేమిటి? పెట్టుబడిదారీవర్గం కమ్యూనిజానికి కాలంచెల్లిందంటున్నారు. రివిజనిష్టులు కమ్యూనిజాన్ని పెట్టుబడిదారీ ఫార్ములాగా దిగజార్చారు. రష్యా, చైనాల్లాంటి దేశాల్లో సోషలిస్టువ్యవస్థకు ఎదురుదెబ్బలు తగిలినా, ప్రపంచంలోని అత్యధిక దేశాల్లో నేడు కమ్యూనిస్టు ఉద్యమాలు బలపడుతున్నాయి. అంతేగాక పెట్టుబడిదారీవ్యవస్థ అవలక్షణాలైన అరాచకత్వం, యుద్ధభయం, పేదరికం, సాంఘిక-సాంస్కృతిక దిగజారుడు, మానవుడు పరాయికరణచెంది వ్యక్తిత్వాన్ని కోల్పోవడం - వీటికి ప్రత్యామ్నాయం సోషలిజం మినహా మరేమీలేదు.

మానవచరిత్ర ఈనాటిది కాదు. అది కొన్ని వేల సంవత్సరాల నుండి పరిణామంచెందుతూ పురోగమిస్తూంది. బానిసవ్యవస్థ, భూస్వామ్యవ్యవస్థ, పెట్టుబడిదారీవ్యవస్థ.... యివన్నీ వేల సంవత్సరాలుగా కొనసాగిన వర్గాల-వర్గ సంఘర్షణలద్వారా ఏర్పడినవే. వేల సంవత్సరాలుగా దోపిడీ భావజాలంతో పాలకవర్గ దృక్పథంలో రూపుదిద్దబడిన మానవుడు తొలిసారిగా మహోన్నతమైన సత్యాన్ని కమ్యూనిజంలో కనుగొన్నాడు. సంక్లిష్టమైన మానవ సమాజ సుదీర్ఘ చరిత్రలో కమ్యూనిస్టు ఆలోచన, దృక్పథం ఒక ముందడుగు మాత్రమే

వేల సంవత్సరాల మానవేతిహాసంలో 150 సం॥ వయసు కల్గిన ఈ నూతన దృక్పథం, ఆలోచనా విధానం కేవలం పురోగమనంలో ఒక ముందడుగుగా భావించాల్సివుంటుంది. సుదీర్ఘమైన మానవచరిత్రలో ఈకాలం అత్యల్పం.

కమ్యూనిజం- ఒక నూతన సిద్ధాంతం, కొత్త రాజకీయం, ఒక నూతన సాంఘిక - సాంస్కృతిక జీవన విధానం - మానవుని - మానవ సమాజాన్ని తరతరాల బంధనాలనుండి, పీడన నుండి విముక్తిచేసే మహోన్నత మార్గం. తన స్వల్పకాల పురోగతిలో కమ్యూనిజం ఎన్నో ఒడుదుడుకులనెదుర్కొంది- ఎన్నో విజయాలు - మరెన్నో పరాజయాలు, ఎన్నో పొరపాట్లు సరిదిద్దుకోడాలు, కొత్త ప్రతిపాదనలు, గుణపాఠాలు,- జీవితంలోలాగే కమ్యూనిజంలో కూడా పవిత్రమైనదంటూ ఏమీలేదు. అదేవిధంగా చిరకాల సత్య (Absolute Truth) మంటూ ఏదీలేదు. మానవ సమాజం - సమాజాభివృద్ధి, కమ్యూనిజం అభివృద్ధిచెందడం చవిచూశాయి. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో లాంటి మహోపాధ్యాయులు దాని అభివృద్ధికి కృషిచేశారు. అదేవిధంగా తొలి సారిగా రష్యాలో దోపిడీ, పీడన లేని సమసమాజస్థాపన - సోషలిస్టునిర్మాణంలో తప్పటడుగులు - పురోగమనాలు - ఎన్నో విజయాలు సాధించి, నాజీల దురాక్రమణను వీరోచితంగా త్రిప్పికొట్టి ఓడించినా, సిద్ధాంత అన్వయంలో, అమలులో జరిగిన పొరపాట్ల వల్ల తిరిగి పెట్టుబడిదారీశక్తుల పునరుద్ధరణ, చివరిగా క్రుశ్చేవ్ పాలన పెట్టుబడిదారీవ్యవస్థ ఏర్పాటుకు దారితీసింది.

రష్యా యొక్క తొలి అనుభవాన్ని, అందులోని పొరపాట్ల నుంచి నేర్చుకొని చైనా మరింత సృజనాత్మకమైన సోషలిస్టు ఆర్థికవిధానాన్ని ఏర్పరుచుకుంది. అంతేగాక శ్రామికవర్గ నియంతృత్వంలో విప్లవాన్ని కొనసాగించుటకు పెట్టుబడిదారీ శక్తులు తిరిగి తలెత్తకుండా చేయడానికి మహత్తర శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవాన్ని జరిపింది. అయినా మావో మరణానంతరం చైనాలో కూడా పురోగామి శక్తులు ఓటమిచెంది పెట్టుబడిదారీవర్గం పాలనలోనికి వచ్చింది. పార్టీలో సృష్టింపబడిన బ్యూరాక్రసీని మావో సాంస్కృతిక విప్లవం ద్వారా కొంతమేరకు దెబ్బతీసినా 1977 నాటికి అది చైనాలో అధికారం చేజిక్కించుకోగల్గింది.

కమ్యూనిజం యొక్క ఈ అనుభవాల్ని విశ్లేషిస్తూంటే మనకు కొన్ని ముఖ్యమైన ప్రశ్నలుదయిస్తాయి- సోషలిజం మొదట వెనుకబడిన దేశాల్లో వచ్చింది. అక్కడ యాంత్రికంగానే పెటీబూర్జువా ఉత్పత్తి ఎక్కువగా

సమీక్ష :

# పగిలిన అద్దంలో పాక్షిక చిత్రం

—మానేపల్లి

తెలుగులో ఉద్యమ కావ్యాలు తక్కువే. తెలంగాణా ఉద్యమానికి ముందు - కన్నెగంటి హనుమంతు, చాకిబండాల చంద్రయ్య, అల్లూరి సీతారామరాజు తమ పరిధిలో తాము ఉద్యమాలు తీసుకువచ్చారు. పాటలు, బుర్రకథలు, చరిత్రలు అరాకొరా వచ్చాయి. ఆయా ఉద్యమాల్ని చిత్రించే కావ్యాలు రాలేదు. తెలంగాణా ఉద్యమాల్ని చిత్రిస్తూ ఆరుద్ర 'త్వమేవాహం', కుందుర్తి 'తెలంగాణా' వచ్చాయి. గంగినేని 'ఉదయిని' కూడా కొంతవరకూ ఆ ఉద్యమాన్ని ప్రతిబింబించింది →

---

వుంటుంది. (Spontaneous growth of petty bourgeois Production అందువల్ల సోషలిస్టు నిర్మాణంకై దీన్ని ఐచ్ఛికంగా, బలప్రయోగం లేకుండా యేవిధంగా కంట్రోలు చేయగలమనేది మొదటి ప్రశ్న - అదేవిధంగా వెనుకబడిన దేశాల ప్రజల చైతన్యం భూస్వామ్యవర్గ లక్షణాలు కల్గివుంటుంది. నూతన ప్రజాస్వామ్య విప్లవదశలో ప్రజల చైతన్యం ప్రజాస్వామ్యస్థాయిలో వుంటుంది తప్ప సోషలిస్టు చైతన్యం వుండదు. సోషలిస్టు ఆలోచనా సరళి బలహీనంగా వుండటంతో పెట్టుబడిదారీ విధానపు పునరుద్ధరణకు అవకాశాలు మెండుగా వుంటాయి. ముఖ్యంగా వెనుకబడ్డ దేశాల్లో సోషలిస్టు నిర్మాణకాలంలో ఉత్పత్తిసాధనాల సామాజికీకరణ జరిగినంత త్వరితగతిన సోషలిస్టు ఆలోచన విధానం అభివృద్ధిచెందదు. వీటి మధ్య సమన్వయం - సమతౌల్యం సాధించే దెలా అనేది రెండవ ప్రశ్న. మార్క్సిజం మానవజాతిని విముక్తి చేస్తుంది. ఆ క్రమంలో వ్యక్తిని గత భావజాలం నుండి విముక్తిచేస్తుంది కూడా. అయితే శ్రామికవర్గ పార్టీ నిర్మాణంగాని, ఉద్యమం యొక్క తక్షణ అవసరాలుగాని చాలామార్లు వ్యక్తిస్వేచ్ఛను హరించేవిగా వుంటాయి. ఈ వైరుధ్యాన్ని యెలా పరిష్కరించాలి? వ్యక్తిగత ఆలోచనా విధానంతో సామాజిక చైతన్యాన్ని యెలా సంధానించాలి? అనేది మరో ప్రశ్న. (వ్యక్తిగత స్వేచ్ఛకు పరిమితులు లేకుండా అనుమతిస్తే తూర్పుయూరప్ దేశాల పరిణామాలు పునరావృతమవుతాయి.) ఇక చివరగా సోషలిస్టు నిర్మాణంలో ఉత్పత్తి సంబంధాలలో, మానవుని చైతన్యంలో మార్పులను, ఉత్పత్తి శక్తులలో మార్పువచ్చినంత వేగంగా

ఫ్రాన్సులో ఏర్పడిన తొలి శ్రామిక రాజ్యం గురించి వి.వి. "పారిస్ కమ్యూన్" వచన కవితా కావ్యం రాశాడు.

నేటికీ నాడు శ్రీకాకుళం జిల్లాలో 1968-70 లలో వచ్చిన సాయుధపోరాటాన్ని గురించి ఛాయారాజ్ "శ్రీకాకుళం" అనే ఉద్యమ కథా కావ్యం రచించారు. ఆయన ఒక దశాబ్దంగా కవితా రచన చేస్తున్నారు. ఉపాధ్యాయ ఫెడరేషన్ (విజయవాడ) లోనూ, జనసాహితిలోనూ చురుకైన కార్యకర్త.

నక్సల్బరీలో రైతులు 1967 లో సాయుధ తిరుగుబాటు చేశారు. పీకింగ్ రేడియో నక్సల్బరీ సంఘటనలను "భారత ప్రజలు మావో సేటుంగ్ మార్గదర్శకత్వంలో తలపెట్టిన సాయుధ సంఘర్షణల పంజాగా వర్ణించింది. అప్పటికే ఇక్కడ శ్రీకాకుళం జిల్లాలో పార్వతీపురం, ఉద్దానం (సోంపేట) ప్రాంతాల్లో గిరిజన రైతులు సంఘటితమై భూస్వాములపై పోరాటం సాగిస్తున్నారు.

---

యెలా సాధించగలం? దీనికి శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం ఒక పరిష్కారమని చెప్పినా, మరేదైనా పరిష్కారం వుందా?

పై ప్రశ్నలేగాక మరెన్నో సందేహాలను ఈనాడు కమ్యూనిస్టు విప్లవకారులెదుర్కొంటున్నారు. భారతదేశంలో విప్లవకారుల మధ్య ఐక్యతా ప్రయత్నం జరుగుతున్న నేటి తరుణంలో కేవలం పైనందిన కార్యక్రమాల్లో తలమునకలయి, కమ్యూనిస్టు ఉద్యమం యే సమస్యలను యెదుర్కొనడంలేదనే ఉష్ట్రపక్షి ధోరణి విప్లవానికి ప్రయోజనకారిగాదు మనదేశంలో సాయుధ విప్లవాన్ని వేగంగా ముందుకు తీసుకువెళ్ళడానికి యెదురయ్యే అడ్డంకులను, సిద్ధాంత, రాజకీయ, సంస్థాగత ఎత్తుగడలకు సంబంధించిన ప్రశ్నల గురించి, ఈ సంక్షోభ కాలంలో తీవ్రంగా ఆలోచించాల్సిన, చర్చించవలసిన బాధ్యత విప్లవకారుల, విప్లవసానుభూతిపరులందరిపైనా యెంతో వుంది—

('ఫ్రాంటియర్' సౌజన్యంతో) స్వేచ్ఛానువాదం: ఆరుణ్

(ఈ వ్యాసంలో రచయిత కొన్ని వివాదాస్పద విషయాల్ని స్పృశించాడు - కమ్యూనిజం తాత్కాలికంగానయినా 'వ్యక్తిస్వేచ్ఛ'ను హరిస్తుందనీ, ఆర్థిక సంక్షోభాలకు కార్మికవర్గంలోని సోమరితనం ఒక కారణమనీ మొదలగునవి. ఇలాంటివాటితో విభేదాలున్నా మొత్తంమీద తూర్పు యూరపు దేశాల్లోని పరిణామాల్ని అర్థంచేసుకోడానికి చాలావరకు ఉపకరిస్తుందనే ఉద్దేశంతో ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం. సం॥)

రాములు మాష్టారు ప్రారంభంలో 'అలజడి' సమగ్ర పోరాటంగా అభివృద్ధి పొందుతున్నది. దానికి వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం ప్రధాన నాయకులు. వారి ప్రధాన కార్యరంగం పార్వతీపురం పరిసరాల్లోని మేరంగి, కురుపాం, మొండెంఖల్లు ప్రాంతాలు. శ్రీకాకుళం జిల్లాకు తూర్పు కొసని 'ఉద్దానం' అంటారు. దాదాపు జీవనదుల్లాంటి గెడ్డలతో, సారవంతమైన భూముల్తో అది ఉద్యానవనంలాగే వుంటుంది. అక్కడ సోంపేట వుంది అక్కణ్ణించే ఉద్యమంలోని సామాన్య కార్యకర్తలుగా ప్రవేశించి సమరయోధులుగా మారేరు సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది కృష్ణమూర్తి, నిర్మల, తామాడ గణపతి మొదలైనవారు.

శ్రీకాకుళం ఏజన్సీ ప్రాంతాల్లో (ఒరిస్సా సరిహద్దులు) గిరిజనులున్నారు. సవర, జాతాపు మొదలైన తెగలవారున్నారు. వారు అడవిని నమ్ముకుని వున్నారు. పోడు వ్యవసాయాన్ని నమ్ముకుని వున్నారు. 1960 ప్రాంతాల నుంచీ వారిపై మైదానప్రాంతపు వర్తకులు 'పట్టు' సాధించే ప్రయత్నం చేశారు. గిరిజనులకు దొరకని ఉప్పు, కిరసనాయిలు, అగ్గిపెట్టెలు మాత్రమేకాక, వ్యవసాయాలకి మదుపులిచ్చారు. గిరిజనుల్ని ఆ అప్పులు తీర్చలేని స్థితికి నెట్టారు. వారి చేలల్లోనే వార్ని పాలేర్లుగా మార్చారు. పల్లె రాములు అనే టీచర్ (ఇప్పటికీ) శ్రీకాకుళం జిల్లాలో ఉన్నారు. దీన్ని కనిపెట్టి సంఘాలు ఏర్పాటు చెయ్యనారంభించారు. దాన్ని అందుకున్నారు వెంపటాపు సత్యనారాయణ. రాములు మేష్టారు తెరమరుగు అయ్యారు. ఆదిభట్ల కైలాసం కలిసి వచ్చారు బలమైన గిరిజన సంఘాలు నిర్మించారు. భూస్వాముల్ని ఎదుర్కొన్నారు. కూలీరేట్లు పెంచుకున్నారు. అక్రమ పద్దుల్ని తగ్గించుకున్నారు. పోరాటం విముక్తి దిశగా నడుస్తున్నది. మొదటి తుపాకిగుండు మేడిద సత్యం అనే భూస్వామి లేవిడి గిరిజన సభలకు వస్తున్న గిరిజనులపై పేల్చాడు. ఆరిక కోరన్న, చిట్టికి మంగన్న నేలకొరిగారు. 1968 నవంబరు 25న సాయుధ రైతాంగ విముక్తి పోరాటాన్ని ప్రారంభించాలని శ్రీకాకుళ జిల్లా కమ్యూనిస్టు కమిటీ నిర్ణయించింది. (దీనికి రాష్ట్రకమిటీతో విభేదాలున్నాయి) నక్సల్బరీ పోరాట సారథి చారు మజుందార్ వెన్నుతట్టాడు. క్రూరాతిక్రూరమైన భూస్వాముల్ని 'వర్గశత్రువులు'గా నిర్ణయించి 'నిర్మూలన' ప్రారంభించారు. వందలాది గిరిజన కుటుంబాల్ని సర్వనాశనం చేసినప్పుడు లేని 'ఖండన' భూస్వాముల్ని నిర్మూలించినప్పుడు ముందుకొచ్చింది. మేధావులు గుండెలు బాదుకున్నారు. విప్లవ కమ్యూనిస్టులు' సైతం దీన్ని జీర్ణంచేసుకోలేకపోయారు. అప్పటి ముఖ్యమంత్రి కాసు

బ్రహ్మానందరెడ్డి, హోంమంత్రి జలగం వెంగళరావు, రెవిన్యూమంత్రి వల్లూరి బసవరాజు పెద్దఎత్తున పోలీసు బలగాల్ని జిల్లాలో మోహరించారు మంత్రులు పోలీసు కాపలాలతో జిల్లా యాత్రలు ప్రారంభించారు. పోరాటయోధుల్ని ఇవేవీ ఆపలేకపోయాయి. బడా భూస్వాములు సుదూరంలో వున్న విశాఖపట్నం వంటి పట్టణాలకు పారిపోయారు.

సాయుధ పోరాటం కొన్ని విజయాల్ని సాధించింది. పార్వతీపురం పరిసర ప్రాంతాల్లో దాదాపు 300 గ్రామాల్ని విముక్తిచేసింది. 'సంఘం' పాలన క్రిందికి తీసుకురాగలిగింది. గుంటూరు ప్రాంతాల్నుంచి చాగంటి భాస్కరరావు, (నరుడో భాస్కరుడు) దేవినేని మల్లిఖార్జునుడు వంటి వారు తుపాకిపట్టి రంగంలోకి దూకారు.

'శ్రీకాకుళం భారతదేశపు ఏనాన్‌' అన్నది ప్రపంచం.

ఉద్యమకారులకు నాటుతుపాకులే తప్ప మరోదారి లేదు. చెప్పుకోదగిన స్థాయిలో సాయుధ దళాలూ లేవు. కేవలం దీక్ష, త్యాగం, పీడిత రైతాంగపు మద్దతుతో పోరాటం ముందడుగు వేసింది. తీవ్రాతి తీవ్రమైన పోలీసుదాడి పెద్ద ఎత్తున అన్ని పక్కల్నుంచీ కమ్ముకువచ్చింది. సామాన్య జనాన్ని కూడా వదల్లేదు. పాలుతాగే పసిపిల్లలు హృదయవిదారకంగా ఏడుస్తుంటే పెద్దవులయినా వదిలేస్తుందేమోకానీ- సాయుధసైన్యాలు వదల్లేదు. క్రూరంగా తుపాకిగుళ్ళకు బలిచేశాయి. ఉద్యమకారులొక్కొక్కరూ నేలకొరిగిపోయారు.

1970 జూలై 10వ తేదీ శుక్రవారం నాడు సాయంత్రం 3-4 గం॥ ముందు ఆదిభట్ల కైలాసం, తరువాత వెంపటాపు సత్యనారాయణ తుపాకి కాల్పులకు గురియ్యారు. (అప్పటికి విరసం ఏర్పాటి వారం కాలేదు). ఆ తరువాత మరొక సందర్భంలో పంచాది కృష్ణమూర్తి పోలీసు కాల్పుల్లో నేలకొరిగారు. సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది నిర్మల అమరులయ్యారు. 1970 చివరికి పోరాటంలో స్తబ్దత ఆవహించింది ఇదీ సంక్షిప్త చరిత్ర.

ఛాయారాజ్‌గారు పోరాట ప్రాంతాల్లో పర్యటించారు. ఈ కథని మరింత వివరంగా విన్నారు. రక్తపు మరకలు చెప్పిన కథలు కళ్ళారా చూశారు అక్కడి విప్లవ వాయువులు ఆయన్ని ఉత్తేజితుణ్ణి చేసినయ్.

1960 ముందునుంచీ శ్రీకాకుళ గిరిజనుల జీవితాన్ని చాలా విపులంగా చిత్రించారు. వాళ్ళ మధ్యకి షావుకార్లు ఎలా పులుల్లా ప్రవేశించి దోచుకుంటున్నదీ కూడా చాలా స్పష్టంగా వర్ణించారు. ఆ ప్రాంతపు నవరల, జాతాపుల

భాషనీ పట్టుకునే ప్రయత్నించేశారు. తెలుగు - ఒరియాల మిశ్రమం అది. ఇప్పపువ్వులా ఒక తమాషా అయిన రుచి ఆ భాషది. (ఈ భాషపై 1920 ప్రాంతాల్లో గిడుగు రామమూర్తి పంతులుగారు విశేష కృషిచేశారు).

రాములు మేష్టారూ, వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం ఎలా ఉద్యమాన్ని నిర్మించారో కళ్ళకి కట్టారు వారు సాధించిన విజయాన్ని పులకింతలలో గానంచేశారు. 1968 నవంబర్‌లో పోరాటం సాయుధమలుపు తీసుకున్నాక- దానితో విభేదించారు. అతివాదం అని విమర్శించారు.

సోంపేట పూజారి 'సుబ్బారావు పాణిగ్రాహి'

.... .... ....

పీడిత ప్రజల 'విముక్తి' కోసమని
ఆత్మృతిపడి తుపాకి చేతపట్టాడు;

అన్నారు నరుడో భాస్కరుడైన డా॥ వాగంటి భాస్కర్రావు.

పరుచూరు వైద్యుడుగ ఎదిగి
వారు పంథాలో విరిగి పోయాడు"ట" వెంపటాపు సత్యనారాయణ వంటి నాయకులు మరణించినపుడు "అతివాదానికి విప్లవ మేధస్సు ఆహుతైపోయింది" అని వాపోయారు ఇలా చివరికి 1124 మంది సాహసులతో ప్రారంభమైన పార్వతీపురం కుట్రకేసును ఎద్దించారు.

శ్రీకాకుళ సాయుధపోరాటాన్ని అంచనా వెయ్యడానికి నిష్పాక్షిక చారిత్రక దృక్పథం అవసరం. అంతేకాదు అమరులపైన, అమపైన వారి త్యాగాలపైన గౌరవం అవసరం. మరి- కవి విముక్తి ఈ కావ్యంతో మిత్రవైరుధ్య స్థాయిలోగాక శత్రువైరుధ్య స్థాయిలో సాగడమే జరగని పని.

ఆగామితరం యువకులకు పరిశోధకులకు చరిత్ర అధ్యాపకులకు కవి ఇస్తున్న చిత్రం ఇదేనా? ఈ పాక్షిక చిత్రాన్ని పట్టుకుని ఆ మహత్తర పోరాటం గురించి తేలిక అంచనా వేసుకునే ప్రమాదం లేదా?

ఈ కావ్యం చూపించిన ఛిద్ర చిత్రం సవరించేందుకు మరొక సమగ్ర కావ్యమే రావలసి వుంది. ఈ బాధ్యతని విప్లవ అవగాహనగల రచయితలు, కవులు తలకెత్తుకోవాలి. లేకుంటే చరిత్ర పేర పాక్షిక వ్యాఖ్యానాల్ని అంగీకరించినట్టవుతుంది. అంగీకరింపజేసినట్టూ అవుతుంది.

నాకు తెలిసినంతలో శ్రీకాకుళ పోరాటంపై వెలువడిన సాహిత్యం ఇక్కడ ఇస్తున్నాను. ఇవి చదివితే కొంతవరకూ స్పష్టమైన అవగాహన ఏర్పడవచ్చు.

1. నక్సల్బరీ వెలుగులో - సుమంతా బెనర్జీ (కృష్ణమూర్తి అనువాదం)
-సామ్యవాద సాహితి, హైదరాబాద్, 1982.

2. శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం
-వసంతాడ రామలింగాచారిగారి కోర్టు స్టేటుమెంట్, 1971.

3. శ్రీకాకుళ సాయుధ రైతాంగ పోరాటం
-అట్టాడ అప్పల్నాయుడు, విరసం ప్రచురణ, 1985.

4. ఎరుపు - సుబ్బారావు పాణిగ్రాహి, విరసం ప్రచురణ, 1972.

5 జముకులకథ - సుబ్బారావు పాణిగ్రాహి, విరసం ప్రచురణ, 1978.

6. శ్రీకాకుళ సత్యం - వెంపటాపు సత్యం పాటలు, విరసం ప్రచురణ, 1978

7. అమరవీరుల జీవితచరిత్ర I, II భాగాలు
-క్రాంతి ప్రచురణ, 1987, 1990

8. సిక్కోలు యుద్ధం (కంజరకథ)
-వంగపండు ప్రసాదరావు, జననాట్యమండలి, 1983

9. శ్రీకాకుళ గిరిజన సాయుధ పోరాటగాథ (బుర్రకథ)
కానూరి వెంకటేశ్వరరావు, అరుణోదయ, 1980

10. జనగానం - (నృత్యకళారూపం) - కానూరి, అరుణోదయ, 1985

11. నన్నెక్కనివ్వండిబోను - విరసం ప్రచురణ, 1988

12. Tribal Revolts - V. Raghavaiah
-Andhrarashtra Adimajati Sevak sangh, Nellore 1971.

ఇవిగాక Economic and Political Weekly, సృజన, అరుణతార పంచికలు, చారుమజుందార్ రచనలు కూడ చదవడం అవసరం. ఇవన్నీ కూలంకషంగా అధ్యయనం చేశాక 'శ్రీకాకుళం' కావ్యం వాస్తవ చరిత్రను ఎలా వక్రీకరించి చూపుతున్నదో స్పష్టపడుతుంది.

శ్రీకాకుళ పోరాట చరిత్రను అధ్యయనం చేసినవారికి, దీన్ని 'అతివాదం' అనడం బాధగా వుంటుంది. త్యాగాలన్నీ "తప్పులే" అనడం మరీ బాధగా వుంటుంది దాదాపు ఇరవై ఏళ్ళ తర్వాత వచ్చిన ఈ ఉద్యమ కావ్యం "పగిలిన అద్దంలో పాక్షిక చిత్రం" మాత్రమే. జనసాహితి ప్రధాన కార్యదర్శి రవిబాబు గారు పరిచయ వాక్యాలు రాస్తూ 1968 కి ముందు ఒక శ్రీకాకుళం, 1968 తరువాత మరొక శ్రీకాకుళం వుందని వివరించి "మీది ఏ శ్రీకాకుళం?" అని అడుగు

తున్నారు. చైనాలో ఎవరూ మీది ఏ యేనాన్? అని అడిగివుండరు. రష్యాలో మీది ఏ మాస్కో అని అడిగివుండరు. మనదేశంలో కూడా ఎవరూ మీది ఏ నక్సల్బరీ అని అడిగినట్టులేదు. ఏ ఉద్యమం గురించి అయినా చర్చ, పరిశీలన సాగవలసిందే. వేయి పూలు వికసించవలసిందే. కాని....

['శ్రీకాకుళం'– వచనకావ్యం. కవి: ఛాయారాజ్, వెల 12 రూ॥లు, ప్రతులకు : మైత్రీ బుక్ హౌస్, విజయవాడ-2]

(జూలై 10, 1990 వెంపటాపు సత్యనారాయణ 20వ వర్ధంతి. ఈ సమీక్షావ్యాసం ఆయన స్మృతికి అంకితం.)

## స్వీకారం

1. ***చైతన్యం నా చిరునామా :*** కవితా సంపుటి. కవి : బీరం సుందరరావు. వెల : 6 రూ. ప్రతులకు : బీరం సుందరరావు, తెలుగు లెక్చరర్, ఇంకొల్లు - 523 167, ప్రకాశం జిల్లా.
2. ***చైతన్య కవిత-9 :*** సంపాదకులు : తంగిరాల సుబ్బారావు, ఆర్వీయస్ సుందరం. చైతన్య కవితా వేదిక, బెంగుళూరు. వెల : 10 రూ. వివరాలకు : ప్రొ॥ టి. వి. సుబ్బారావు, తెలుగు శాఖ, బెంగుళూరు యూనివర్సిటీ, జ్ఞానభారతి, బెంగుళూరు - 560 056.
3. ***నిజామాబాద్ జిల్లా సాహిత్యం*** (1955 - 1985) ఒక పరిచయం : గిరి నాగభూషణం. ప్రతులకు : గిరి నాగభూషణం, అర్సపల్లి. వయా సారంగపూర్, నిజామాబాద్ జిల్లా, 503 186.

---

## విజ్ఞప్తి

- 'అరుణతార'ల కోసం, ఇతర ప్రచురణల కోసం M.O. చేస్తున్నవారు M.O. ఫారం కింది కూపన్‌లో తప్పనిసరిగా అడ్రసు స్పష్టంగా రాయాలి.
- పోస్టల్ రేట్లు పెరిగినా కొందరు పాతరేట్ల ప్రకారమే తమ ఉత్తరాలకు స్టాంపులు వేస్తున్నారు. అందువల్ల ఇక్కడ రెండింతలుగా పెనాల్టీ చెల్లించవలసి వస్తోంది. స్టాంపులు సరిగ్గా వేయండి.
- ఎవరికైనా, ఎప్పుడైనా పత్రిక అందకపోతే వెంటనే మీ అడ్రసుతో కార్డు రాయండి, పంపిస్తాం.
- 'అరుణతార'కు చందాలు, విరాళాలతోబాటు కవితలు, పాటలు, కథలు, వ్యాసాలు మొ॥వి పంపి సహకరించండి. ——సం॥

తున్నారు. చైనాలో ఎవరూ మీది ఏ యేనాన్? అని అడిగివుండరు. రష్యాలో మీది ఏ మాస్కో అని అడిగివుండరు. మన దేశంలో కూడా ఎవరూ మీది ఏ నక్సల్బరీ అని అడిగినట్టులేదు. ఏ ఉద్యమం గురించి అయినా చర్చ, పరిశీలన సాగవలసిందే. వేయి పూలు వికసించవలసిందే. కాని....

['శ్రీకాకుళం'– వచనకావ్యం. కవి: ఛాయారాజ్, వెల 12 రూ॥లు, ప్రతులకు : మైత్రీ బుక్ హౌస్, విజయవాడ-2]

(జూలై 10, 1990 వెంపటాపు సత్యనారాయణ 20వ వర్ధంతి. ఈ సమీక్షావ్యాసం ఆయన స్మృతికి అంకితం.)

## స్వీకారం

1. ***చైతన్యం నా చిరునామా*** : కవితా సంపుటి. కవి : బీరం సుందరరావు. వెల : 6 రూ. ప్రతులకు : బీరం సుందరరావు, తెలుగు లెక్చరర్, ఇంకొల్లు - 523 167, ప్రకాశం జిల్లా.
2. ***చైతన్య కవిత-9*** : సంపాదకులు : తంగిరాల సుబ్బారావు, ఆర్వీయస్ సుందరం. చైతన్య కవితా వేదిక, బెంగుళూరు. వెల : 10 రూ. వివరాలకు : ప్రొ॥ టి. వి. సుబ్బారావు, తెలుగు శాఖ, బెంగుళూరు యూనివర్సిటీ, జ్ఞానభారతి, బెంగుళూరు - 560 056.
3. ***నిజామాబాద్ జిల్లా సాహిత్యం*** (1955 - 1985) ఒక పరిచయం : గిరి నాగభూషణం. ప్రతులకు : గిరి నాగభూషణం, అర్సపల్లి. వయా సారంగపూర్, నిజామాబాద్ జిల్లా, 503 186.

---

## విజ్ఞప్తి

- 'అరుణతార'ల కోసం, ఇతర ప్రచురణల కోసం M.O. చేస్తున్నవారు M.O. ఫారం కింది కూపన్‌లో తప్పనిసరిగా అడ్రసు స్పష్టంగా రాయాలి.
- పోస్టల్ రేట్లు పెరిగినా కొందరు పాతరేట్ల ప్రకారమే తమ ఉత్తరాలకు స్టాంపులు వేస్తున్నారు. అందువల్ల ఇక్కడ రెండింతలుగా పెనాల్టీ చెల్లించవలసి వస్తోంది. స్టాంపులు సరిగ్గా వేయండి.
- ఎవరికైనా, ఎప్పుడైనా పత్రిక అందకపోతే వెంటనే మీ అడ్రసుతో కార్డు రాయండి, పంపిస్తాం.
- 'అరుణతార'కు చందాలు, విరాళాలతోబాటు కవితలు, పాటలు, కథలు, వ్యాసాలు మొ॥వి పంపి సహకరించండి. —సం॥

# 'ప్రొలిటేరియట్' ప్లీజ్!

రాత్రి కూడానా-
జులుం గురుతుల్ని కిరాతకంగా రాల్చుకుంటూ
పొదలు, పొదలుగా అరాచకాల అదృశ్యం,
రాత్రి కూడానా!
అహింసల కుచ్చుళ్ళతో మీరు బుద్ధిజం కన్నీళ్ళు
తుడిచినంత కాలం,
రెడ్ లెటర్స్‌పై డేట్ స్టాంప్ పడినంత వేగంగా-
ఉక్కుపాదాలు మీ వీపుల్ని కరుస్తూనే ఉంటాయి.
కుప్పకూలిన పోరాట దిబ్బలపై
ఫ్లాగ్ మార్చ్ జరుగుతూనే ఉంటుంది.
నేడు ప్రతిలోకాలే కాదు, రేపు గుడారం, గుడారం
నెత్తుటి హిమాన్ని కంబళి కప్పుకుంటుంది.
పడగండ్ల ఎన్‌కౌంటర్‌లో, చెట్లు
సింధూరపు కన్నీళ్ళు రాల్చుకుంటున్న దృశ్యాన్ని
మీ గుమ్మానికి ఫ్రేమ్ కట్టండి.
గుబురుచెట్ల బుల్లెట్ ప్రూఫ్‌లతో
విల్లంబుల కొమ్మలు కావాలి.
అప్రమత్తతను అదిమిపడుతూ
'యాంబుష్' పదానికి అర్థం తెలుసుకోండి.
చూపుల్తో ప్రతి శబ్దాన్ని పట్టిపట్టి చూడండి.
పొలిమేరల వాకిళ్ళలో-
అంతిమశ్వాసల ఊపిరితిత్తుల పగుళ్ళనుంచి,
స్వేచ్ఛా పవనాలు వీచేదాకా,
దిక్కుతోచని కుంభవర్షం కురుస్తూనే ఉండాలి.
కాలం కళ్ళెం తెరుచుకొని, రంకె వేస్తోంది,
'ప్రొలిటేరియట్'! అటెన్షన్ ప్లీజ్!!

—పొదలకూరు మధుకుమార్

Annual Subscription Rs. 30/- Single Issue Rs. 3/-

# గుండె దడ

మామిడికోరిలో పరతుపాకులతో మట్టికలిపావని
మారుమ్రోగే తుపాకులకు తుపాకులతోనే సమాధానం చెప్పావని
మురిసిపోయాడు వాడు, కాని....
మీ రక్తం ఏరులై పారినప్పుడు, దండకారణ్యంలో దండోరా వేసినప్పుడు
మీరు మొక్కలై మొలిచి, మ్రానులై నిలిచి, మా బందూకులకు 'భట్'లై
మందుగుండు సామగ్రికి ముడిసరుకైనప్పుడు
ఇంతేకాదు మా కర్తవ్యం ఇంకా ఉందని మీరు ప్రతిధ్వనించినప్పుడు
చూడాలి వాడి గుండె దడ....
మీ రక్తం బొట్టుబొట్టుగా వాడి గుండెకు తుపాకి తూటాలై గుచ్చుకున్నప్పుడు
చూడాలి వాడి గుండె దడ....
వాడు కేషికల్ ఘటిలో కన్నెర్రజేసి ముందుకు సాగనివ్వనన్నాడు
కానీ.... ఏ వడగాడ్పులు, సుడిగాడ్పులు
మమ్మల్ని ఏమీ చెయ్యలేవని,
మీరు తుఫానులై, తుపాకులై వాణ్ని గాయపరిచినప్పుడు
చూడాలి వాడి గుండె దడ....
మీ గుండెల్లో గుండ్లుదించి గురకపెట్టి నిద్రపోవాలని చూశాడు వాడు
కానీ.... జనం వాడి గుండెనే టార్గెట్‌గా చేసుకుని
విల్లంబులు ఎక్కుపెట్టినప్పుడు చూడాలి వాడి గుండెదడ....
ఇంద్రావతి, సీలేరు, సికమాను, నర్మద నదులు
ఏకమై మానిక్‌ఘడ్ కొండల్ని మైమరపించి
పెన్‌గంగా పెన్నిధిలో.... దండకారణ్యంలో దండులో
తుండులై, తుపాకులై మ్రోగినప్పుడు చూడాలి వాడి గుండె దడ ...

[1989 మే 10న పోలీసుకాల్పుల్లో ఆదిలాబాద్ జిల్లా పిప్పల్‌దరిలో అమరులైన కా॥ జంగుధాదా [మారుతిరావు] కా॥ రమణ [నారాయణ] ల స్మృతిలో....]

—సికింజా

Printed at Konarka Printers, Kavali on behalf of Venkataramana Printers, Guntur-1. Revolutionary Writers' Association